# జలుబు మిమ్మల్ని విడవకుండా పీడిస్తోందా?

మామూలు మందులు జలుబుని
కేవలం కొద్ది గంటల పాటు
నిద్రపుచ్చగలవు అంతే.

ఆయుర్వేదంలో జలుబుని
పూర్తిగా పోగొట్టే ఓ ఆయుధం ఉంది.

మామూలు మందులు జలుబుతో పోరాడవు. దానివల్ల వచ్చే ఇబ్బందుల్ని కాస్సేపు మాత్రం అణచి ఉంచుతాయి.

ఆయుర్వేద త్రిశూణ్ మీ శరీరంలో నిరోధక శక్తిని పెంపొందిస్తుంది. ఆ విధంగా జలుబుని ఎదుర్కొనేలా చేస్తుంది.

మీరు త్రిశూణ్‌ని మొదటి జలుబు లక్షణం కనపడగానే వాడారంటే జలుబుని సమర్థంగా నిరోధించవచ్చు.

---

మోతాదు: ఒక్కొక్క మాత్ర చొప్పున రోజుకి రెండుసార్లు.

జలుబు అప్పుడే ప్రారంభమవుతూంటే, త్రిశూణ్ ఒక్కరోజు తీసుకోండి. జలుబు తీవ్రంగా ఉంటే త్రిశూణ్ 2 1/2 రోజులు తీసుకోండి. టీ, కాఫీ లేదా వెచ్చటి నీటితో తీసుకోవాలి. ప్యాకెట్ మీది పూర్తి వివరాలను జాగ్రత్తగా చదవండి.

---



**Trishun** **త్రిశూణ్**

జలుబుకు తిరుగులేని జవాబు






జండూ ఫార్మసూటికల్ వర్క్స్ లిమిటెడ్.
గోఖలే రోడ్ సౌత్, దాదర్, బొంబాయి 400 025.

*Trikaya.ZP.2.86 TEL A*



# చందమామ

నవంబర్ 1987



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





విడి ప్రతి: 2-50

సంవత్సర చందా: 30-00

# రైటర్స్ మిల్క్ చాక్లెట్.
# నోట్లో వేసుకోగానే కరిగిపోతుంది!




రైటర్స్ మిల్క్ చాక్లెట్,
స్విట్జర్లాండు దేశపు
జేకబ్స్ సుషార్డ్ వారి
సహకారంతో
తయారుచేయబడినది.
వీరు
ప్రపంచంలోకెల్లా
అత్యుత్తమ చాక్లెట్
తయారీదార్లు.

పరిపుష్టమైన, నున్నని.
క్రీమునిండిన రుచికరమైన చాక్లెట్.

ఇలాంటి చాక్లెట్ కోసం
సముద్రాలే దాటి వెళ్లేవారు.
మీకిప్పుడది నేరుగా ఇక్కడే లభిస్తోంది.

ఇప్పుడు మీరు పాత మిల్క్
చాక్లెట్ దేనితోనూ సరిపెట్టుకోబోరు.
ఎందుకేమిటి ?

మీరే తెలుసుకున్నారు కదా.
మంచిది.

**స్విట్జర్లాండు దేశపు జేకబ్స్ సుషార్డ్ వారి సహకారంతో తయారుచేయబడినది.**

అమ్మకందార్లు

# చందమామ


సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి


ఈ నెల బేతాళకథ ["గంధర్వుడి శాపాలు"] కు అధారం ఎన్. శివనాగేశ్వరరావు రచన. ఇతరుల అవసరాన్నో, అమాయకత్వాన్నో ఆసరాగా చేసుకుని, కొందరు అమితంగా ధనం సంపాయించాలనే ప్రయత్నాలు చేస్తారు. అయితే, అది బెడిసికొట్టినప్పుడు, తామెంత అమానుషంగా ప్రవర్తించినదీ తెలిసివచ్చి, పశ్చాత్తాపానికి గురి అవుతారు. ఇందుకు ఉదాహరణ ''రోగి-వైద్యుడు'' అన్న కథ.

## అమరవాణి

జాతస్య నదీతీరే తస్యాపి, తృణస్య జన్మసాఫల్యం,
యత్ సలిలమజ్జనాకుల, జనహస్తాలంబనమ్ భవతి.

[ప్రవాహంలో మునిగిపోతున్న మనిషి, ఊతగా తీసుకుని బయట పడగలిగినట్టయితే, నదీ తీరాన మొలిచిన గడ్డిపోచలకు సైతం సార్థకత లభిస్తుంది.]


సంపుటి 81 నవంబర్ '87 సంచిక 5

విడి ప్రతి : 2–50 :: సంవత్సర చందా : 30–00




# చందమామ కబుర్లు



## కీడు - మేలు

మధ్యప్రదేశ్‌లోని గర్హి గ్రామంలో పిడుగు పడటంవల్ల ఒక పిల్లవాడు మరణించాడు. అయితే, అదే పిడుగుపాటు కారణంగా, పుట్టినప్పటినుంచీ మూగగా వున్న మరొక కుర్రవాడికి మాట వచ్చింది!

## కోశాధికారి గోరీ

ఈజిప్టులో ప్రసిద్ధిగాంచిన ఫరావో టుటాంకమన్‌కు కోశాధికారీ, పూజారీ అయిన మయా, గోరీ అతని సతీమణి మెరీట్, గోరీ ఇటీవలే కనుగొనబడినవి. ఈ సుప్రసిద్ధ కోశాధికారి గోరీలో విలువైన నిధులు ఉండవచ్చని భావిస్తున్నారు.





## మాస్కోలో ఎత్తయిన చెట్టు

మాస్కోలో 'ఫెస్టివల్ ఆఫ్ ఇండియా' ఉత్సవం ప్రారంభమయినప్పుడు, అక్కడి ఉద్యానవనంలో ఒక దేవదారు మొక్కను నాటారు. ఇది 100 అడుగుల ఎత్తు వరకూ పెరగవచ్చనీ, ఇదే ఆ ఉద్యానవనంలో అన్నిటికన్నా ఎత్తయిన వృక్షం కాగలదనీ భావిస్తున్నారు.

## దాగివున్న సైనికుడు!

రెండవ ప్రపంచ యుద్ధానికి చెందిన కుస్మా పంచన్కో అనే 79 సంవత్సరాల సైనికుణ్ణి, ఉక్రేన్ అధికారులు ఇటీవల కనుగొన్నారు. జర్మన్ వారికి లొంగిపోవడంవల్ల తాను పట్టుబడితే, తనను సైబీరియాకు పంపివేయగలరన్న భయం కొద్దీ, పంచన్కో తాను వంటగదిని వదిలి బయటికి రాకుండా 42 సంవత్సరాలు గడిపారు. అతడు మరణించినట్టుగానే ఇంతకాలం అతని కుటుంబంవాళ్ళు, బయటి ప్రపంచానికి చెబుతూ వచ్చారు!



# జడభరతుడు

భరతుడనే రాజు వృద్ధుడయ్యాక, రాజ్యభారాన్ని తన కొడుకులకు అప్పగించి, సన్యాసజీవితం గడపడానికి అడవికి చేరాడు. ఒకనాడాయన నదిలో స్నానం చేస్తూ ఒక లేడి కూనను చూశాడు. దాని తల్లి చనిపోయింది. భరతుడు జాలిపడి లేడి కూనను, తనతోపాటు కుటీరానికి తీసుకువచ్చి, దానిని అమిత అనురాగంతో సొంత బిడ్డలా భావించి పెంచసాగాడు. లేడి పిల్ల పెరిగి పెద్దదయింది. దానిమీద గల గాఢమైన ప్రేమకొద్దీ, అతడు లేడిని తలుచుకుంటూనే ప్రాణం వదిలాడు. ఆ కారణంగా మరుజన్మలో అతడు జింకగా పుట్టాడు. ఆ జన్మలో, అతడు తను పూర్వ జన్మలో లేడి పిల్లమీద పెంచుకున్న బంధానికి ఎంతగానో విచారించాడు. జింక మరణించాక, భరతుడొక బ్రాహ్మణుడింట జన్మించాడు.

పూర్వజన్మల అనుభవాలు జ్ఞాపకం వుండడంవల్ల, అతడు దేనిమీదా ఆసక్తి కనబరచకుండా వుండేవాడు. అది తెలియని ప్రజలు, అతణ్ణి మందబుద్ధిగా ఎద్దేవా చేయసాగారు. భరతుడి సవతి తల్లి అతన్ని వేధించనాగింది. ఆమె పోరు పడలేక అతడు సన్యాసుల్లో కలిసిపోదామని ఇల్లు వదిలిపెట్టాడు.

అప్పుడు కొందరు రాజభటులు అతన్ని బంధించి, రాజుగారి పల్లకీ మోయడానికి నియోగించారు. రాజుగారి పల్లకీని మోస్తూ, కాళ్ళకింద చిన్న చిన్న పురుగులు కూడా పడి చావకుండా జాగ్రత్త తీసుకుంటూ నడవసాగాడు. అందువల్ల పల్లకీ అటూ ఇటూ ఊగసాగింది. ఆ కుదుపులకు ఆగ్రహం చెందిన రాజు భరతుణ్ణి తన్నసాగాడు. రాజుగారి దెబ్బలను నిబ్బరంగా భరిస్తూ, భరతుడు రాజుకు, పురాణేతిహాసాల రహస్యాలను వివరించసాగాడు. రాజు దిగ్భ్రాంతిచెంది, పల్లకీ దిగివచ్చి భరతుడి పాదాలపై పడ్డాడు. అయినా భరతుడు దానిని కూడా పట్టించుకోకుండా అడవికిపోయి, తపస్సు చేసి ముక్తి గాంచాడు. జీవితంలో ఎదురైన బాధలకూ, మానావమానాలకూ చలించని ముని కావడంవల్ల ఆయనకు జడభరతుడు అన్న సార్థక నామం ఏర్పడింది!






దివాకరుడనే భాగ్యవంతుడికి, ఉన్న పళంగా జబ్బు చేసింది. ఏదో మందిచ్చే సరికి, ఆయన బాగా తేరుకున్నాడు. వైద్యుడు ఆయనతో, "మీ జబ్బు చాలా ప్రమాదకరమైనది. నేను తాత్కాలికోప శమనానికి మందిచ్చాను. త్వరలోనే యిది తిరగబెట్టవచ్చు." అన్నాడు.

"అలా తిరగబెట్టకుండా మందు లేదా?" అని అడిగాడు దివాకరుడు.

"ఉన్నది. నెల రోజులపాటు ప్రత్యేకమైన మందులు తినాలి. అయినా పూర్తిగా తగ్గుతుందన్న నమ్మకం లేదు. అంతా మన అదృష్టం!" అన్నాడు వైద్యుడు.

"అదృష్టం మీద, నాకేనాడూ నమ్మకం లేదు. వైద్యం ప్రారంభించండి," అన్నాడు దివాకరుడు.

వైద్యుడు కొద్దిసేపు ఆలోచించి, "వైద్యానికి బాగా ఖర్చవుతుంది. మొదటి నెలలోనే సుమారు పాతికవేల వరహాలు కావాలి. రెండో నెలలో పదివేలు. మూడో నెల నుంచి, మూడు నెలలపాటు అయిదు వేలు. అక్కణ్ణించి అయిదు నెలలపాటు, నెలకు వేయివరహాలు—అందుకే, తటపటాయిస్తున్నాను!" అన్నాడు వైద్యుడు.

"అంటే, పదినెలల్లో యాభైఅయిదు వేల వరహాలు. చాలా ఎక్కువ!" అన్నాడు దివాకరుడు.

"బాబూ, తమరు లక్షలకు లక్షలు సంపాయించారు. ఇది తమకు పెద్ద మొత్తం కాదు. డబ్బుకోసం వెనకాడకండి," అన్నాడు వైద్యుడు.

ఎంతో భాగ్యవంతుడైన దివాకరుడు నవ్వి, "నాకిప్పుడు అరవైఏళ్ళు. తెలివితేటలతో ఎంతో డబ్బు సంపాయించిన మాట నిజమే! కాని, మాదంతా పైన పటారం, లోన లొటారం. దగ్గిర డబ్బెంత

"వసుంధర"



వున్నదో, అప్పులూ అంతగా వున్నవి. ఇటీవల వ్యాపారం నష్టంతో నడుస్తున్నది. ఒక సంవత్సరం పాటు మేమెంతో జాగర్తగా వుండాలని, అనుకుంటూండగా, ఈ జబ్బు వచ్చింది. నేను బతకడంవల్ల, మా పిల్లలకు పెద్ద ఉపయోగమేమీలేదు. ఒకనాటి మాట ఎలా వున్నా, ఇప్పుడు నా శరీరం యాభైఅయిదువేలవరహాల విలువ చెయ్యదు,'' అని చెప్పాడు.

అందుకు వైద్యుడు, ''మీరు దిగులు పడకండి. నేను విషయం తమ పిల్లలకు చెబుతాను,'' అన్నాడు.

దివాకరుడు వెంటనే, ''అయిదు సంవత్సరాల నుంచి, నా వ్యాపారమంతా పిల్లలే చూసుకుంటున్నారు. నా ఆస్తి పాస్తులన్నీ కూడా, వాళ్ళకే యిచ్చేశాను. వాళ్ళు, నన్ను తండ్రిగా గౌరవిస్తున్నారు; అభిమానిస్తున్నారు. అంతకు మించిన ప్రతిఫలం, నేనాశించను. నా వంట్లో యింకా శక్తి వున్నదో లేదో! ఈ నెల నుంచి తిరిగి సంపాదన ప్రారంభిస్తాను. నా వైద్యానికి అవసరం అయిన డబ్బు, కొద్దికాలంలోనే, నేను సంపాయించ గలిగితే, నా శరీరాన్ని నిలబెట్టుకునేందుకు అర్హుణ్ణి. లేకుంటే దీన్నిలాగే పోనివ్వండి. మీరు, నా పిల్లలకు చెప్పి వైద్యం చేస్తానన్నా, నేను మందులు వేసుకోను. ఎప్పటికైనా ఒకరి మీద ఆధారపడని బతుకు నాది,'' అన్నాడు.

''బాబూ, వైద్యం లేకపోతే, తమరెంతో కాలం బతకరు. తమరు కొత్తగా డబ్బు సంపాయించినా, వైద్యానికి వేళ దాటి పోతుంది,'' అన్నాడు వైద్యుడు.

''నన్ను బతికించగలనన్న నమ్మకం, మీకుంటే, యిప్పుడే వైద్యం ప్రారంభించండి. ఆరు నెలల్లో మీకు లక్ష వరహాలిస్తాను,'' అన్నాడు దివాకరుడు.

వైద్యుడు, ''లక్ష వరహాలే!'' అని ఆశ్చర్యపోయి, ''ఆరు నెలల్లో నాకివ్వడానికి, అంత డబ్బు సంపాయించ గలరా?'' అని అడిగాడు.

"సామాన్య వైద్యులైన మీరు, పది నెలల్లో యాభై అయిదు వేల వరహాలు సంపాయించగలిగినప్పుడు, వ్యాపారస్థుడనైన నేను, అరునెలల్లో లక్షవరహాలు సంపాదించలేనా?" అన్నాడు దివాకరుడు.

వైద్యుడు మారుమాట్లాడకుండా, ఆ రోజు నుంచే వైద్యం ప్రారంభించాడు. ఒక నెల రోజులు గడిచాక, ఆయన దివాకరుణ్ణి, "బాబూ, తమ సంపాదన ఎంతవరకు వచ్చిందో తెలియదు. ఇప్పుడు పదివేల వరహాలైనా యివ్వగలరా?" అని అడిగాడు.

"అరు నెలలు గడవనివ్వండి. మీకు పూర్తిగా లక్షవరహాలూ యిస్తాను," అన్నాడు దివాకరుడు.

"కాని, ఇంట్లో నాకెన్నో యిబ్బందులున్నవి. అంతవరకూ ఆగలేను," అన్నాడు వైద్యుడు.

"మీ యిబ్బందులేమిటో చెప్పండి. నేను పరిష్కారమార్గం చెప్పగలను," అన్నాడు దివాకరుడు.

"లోగడ నా పెద్దకూతురు పెళ్ళికి, పదివేలవరహాలు కట్నం బాకీ పడ్డాను. ఇప్పుడు దాని కూతురు పెళ్ళీడు కొచ్చింది. నేను, నా బాకీ తీర్చకపోతే, తనకూతురుకు పెళ్ళి చేయలేనని, అది ఏడుస్తున్నది," అని చెప్పాడు వైద్యుడు.



"దానిదేముంది? మీ పెద్దకొడుకు కొడుకు, ఆ పిల్లకీడైనవాడే గదా? మేనరికం చేసెయ్యండి—కట్నం తీసుకోకండి," అని సలహా యిచ్చాడు దివాకరుడు చిన్నగా నవ్వుతూ.

"నేనూ అలాగే అనుకున్నాను. కాని, నా కోడలు కట్నం కావాలంటున్నది. వాళ్ళిప్పుడు నా నుంచి వేరుపడిపోయారు," అన్నాడు వైద్యుడు.

"అంతేగదా! అరు నెలల్లో, మీకు, నేను లక్షవరహాలు యివ్వబోతున్న విషయం, అందరికీ చెప్పాకోండి. కోడలూ, కొడుకూ వచ్చి, మీతో కలిసి వుంటారు," అన్నాడు దివాకరుడు.



తున్నారు. అప్పులవాళ్ళు యింటి చుట్టూ తిరుగుతున్నారు. వాళ్ళ బాకీ అయిదు వేల వరహాలు,'' అన్నాడు వైద్యుడు.

''నేను మీకు లక్షవరహాలూ యిస్తాను. అందులో కొంత పెద్దకొడుకు తీసుకుంటాడు. మీ భార్య నగలు చేయించుకుంటుంది. మీ యిల్లు కాస్త పెద్దది చేయిస్తారు. అప్పులన్నీ తీర్చేస్తారు. ఆ తర్వాత మరి కొంతకాలం జీవిస్తారుగదా? ఇప్పటికే అప్పులున్నాయంటే— మీరు ఆదాయానికి మించి ఖర్చుపెడుతున్నారని, నా ఉద్దేశం,'' అన్నాడు దివాకరుడు.

దివాకరుడి మాటలకు, వైద్యుడు ముఖం చిన్నబుచ్చుకుని, ''అవును, బాబూ! నా చిన్నకొడుక్కు బొత్తిగా బాధ్యత తెలియదు. నా భార్య వాడికి పూర్తిమద్దతు యిస్తుంది. నా ఆదాయం, నా ఖర్చులకంటే తక్కువ,'' అన్నాడు.

''అలా అయితే, కేవలం వైద్యవృత్తి వల్ల, మీరు కుటుంబపోషణ చేయలేరు. నావంటి రోగి, మీకు అస్తమానూ దొరకడు: కాబట్టి మీరు, మీ చిన్నబ్బాయిని వ్యాపారంలో ప్రవేశపెట్టండి. ఒకసారి సంపాదనలోపడితే, వాడేదారికొస్తాడు,'' అన్నాడు దివాకరుడు.

''వాణ్ణి వ్యాపారంలో పెడితే, పెట్టుబడే తినేస్తాడని, నాభయం,'' అన్నాడు వైద్యుడు.

రెండు రోజుల తర్వాత, వైద్యుడు ఉత్సాహంగా తిరిగి వచ్చి, ''బాబూ, అంతా మీరు చెప్పినట్టే జరిగింది. నా కొడుకిప్పుడు, నాతో కలిసి వుంటున్నాడు. కోడలు, నా మనమరాలిని, తన కోడలుగా చేసుకుంటానన్నది,'' అని చెప్పాడు.

దివాకరుడు నవ్వి వూరుకున్నాడు.

మరొకమాసం గడిచాక వైద్యుడు, దివాకరుణ్ణి డబ్బు గురించి అడిగాడు.

''మళ్ళీ ఎలాంటి యిబ్బంది వచ్చింది?'' అని అడిగాడు దివాకరుడు.

''నా భార్య నగలు చేయించమంటున్నది. లక్షవరహాలు రానున్నవని తెలిసి, అందరూ విపరీతంగా కోరికలు చెబు

దివాకరుడు నవ్వి, "మీవాడు, మీరను కున్నంత జులాయికాదు. వాడికి రత్న సేనుడితో మంచి స్నేహం వున్నది. వాడంటే ఎంతో నమ్మకం వున్నది. రత్న సేనుడు పేదవాడే కాని కడుసమర్థుడు. తగిన యీడు పిల్ల వుంటే, తప్పకుండా నేను వాణ్ణి, నా ఇంటల్లుణ్ణి చేసుకునేవాణ్ణి. మీరు రత్నసేనుడికి, మీ చిన్న అమ్మాయి నిచ్చి పెళ్ళి చేయండి. రత్నసేనుడు ఇల్లరికం వుంటాడు. బావమరుదు లిద్దరూ కలిసి వ్యాపారం చేస్తారు; తప్పక రాణిస్తారు," అన్నాడు.



"మీరు చెప్పింది బాగానే వున్నది. కాని, వ్యాపారానికి పెట్టుబడి కావాలి గదా! ఆ డబ్బయినా, మీరివ్వండి," అని అడిగాడు వైద్యుడు.

అందుకు దివాకరుడు, "మీ ఇంట్లో యాభైబస్తాల ధాన్యం వున్నది. రెండు వందల కొబ్బరికాయలున్నవి. ఖర్చయినా సందేహించక, వాటిని ఎడ్లబళ్ళ మీద వీరవరానికి తరలించేండి. అక్కడ వాటికి రెట్టింపు ధరవస్తుంది. లాభసాటిగా వుంటే, ఊళ్లో యితరుల నుంచి కూడా ధాన్యం, కొబ్బరికాయలు కొని, వీరవరంలో అమ్ము తూండమనండి. ఆ మాత్రం అవకాశం వుంటే, మిగతాదంతా రత్నసేనుడే చూసు కుంటాడు," అన్నాడు.

పది రోజుల తర్వాత, వైద్యుడు సంతో షంగా దివాకరుడితో, "మీరు చెప్పినట్టే జరిగింది. నా రెండో కొడుకు దారిలోకి వచ్చాడు," అన్నాడు.

అలా ఒకనెల గడిచాక, వైద్యుడు మళ్ళీ దివాకరుణ్ణి డబ్బడిగాడు.

దివాకరుడు నవ్వి, "అన్నసమయానికి ముందుగా, నేనివ్వనని తెలిసీ డబ్బడుగుతా వెందుకు? మీకు డబ్బు కాపీనం బాగా ఎక్కువ. కాపీనం వున్నవాడికి తృప్తి వుండదు. తృప్తి లేనివాడికి సుఖం వుండదు. సుఖపడనివాడు డబ్బు సంపా యించలేడు. మనం ఎంత సంపాయించినా, యితర్లకోసమే గదా!" అన్నాడు.



మానిస్తూంటే సంతోషంగా వున్నది. అయినవాళ్ళు మాత్రం, మీరిచ్చే లక్ష కోసం ఎదురుచూస్తున్నారు,'' అన్నాడు.

''అది చాలా ప్రమాదం. నేను మిమ్మల్ని మోసం చేశాననీ, డబ్బివ్వడం లేదనీ అందరికీ చెప్పండి. అప్పటికీ మిమ్మల్ని వదిలిపెట్టనివాళ్ళే, నిజమైన బంధువులు. ఒకవేళ అంతా మిమ్మల్ని వదిలివెళితే, వాళ్ళకు నేనిచ్చే డబ్బులో, మీరు ఒక్క వరహా కూడా యివ్వనవసరం లేదు,'' అన్నాడు దివాకరుడు.

''కాని, అప్పుడు నాకు, నా అన్నవాళ్ళెవరూ వుండరు!'' అన్నాడు వైద్యుడు.

అందుకు దివాకరుడు, ''మీ కూతురు కట్నం బాకీ తీరింది. కట్నం లేకుండా చిన్నకూతురుకు సమర్థుడైన వరుడు దొరికాడు. జులాయివాడనుకున్న కొడుకు వ్యాపారంలో నిలదొక్కుకున్నాడు. ఇప్పుడు మీకు సమస్యలు లేవు. అయినవాళ్ళు దూరంగా వుంటే మాత్రం నష్టమేమిటి? ఊళ్ళో ఎందరో మిమ్మల్ని అభిమానిస్తున్నారు,'' అన్నాడు దివాకరుడు.

''నా దగ్గిర డబ్బుంటే తప్ప, అయినవాళ్ళెవరూ నన్ను గౌరవించరు. అందుకే అడుగుతున్నాను,'' అన్నాడు వైద్యుడు.

''డబ్బు కోసం గౌరవించేవాళ్ళు, అయినవాళ్ళు కారు. అలాంటి వారికోసం మీరు సంపాయించడమూ వృథాయే! చేతనైనంతలో పదిమందికీ సాయం చేయండి. ఎందరో మిమ్మల్నభిమానిస్తారు,'' అని సలహా యిచ్చాడు దివాకరుడు.

ఇంకొక నెల గడిచాక వైద్యుడు, దివాకరుడితో, ''మీరు చెప్పింది నిజం! చాలామందికి తక్కువ డబ్బుతో వైద్యం చేస్తున్నాను. పేదవారినైతే డబ్బు గురించి అడగడం లేదు. ఊళ్ళో అందరూ నన్నభి

వైద్యుడు తనను దివాకరుడు మోసం చేసిన విషయం, ఇంట్లోవాళ్ళకు మాత్రం చెప్పాడు. కోడలికి కోపం వచ్చి, తన కోడలిని పుట్టింటికి పొమ్మన్నది. అయితే, అప్పటికే వైద్యుడి కోడలికొడుకు, భార్య

అంటే ఎంతో ప్రేమానురాగాలతో వున్నాడు. వాడు భార్యతోపాటు, తనూ వెళ్ళిపోతా ననేసరికి, కోడలు దిగివచ్చింది. ఊరంతా ఎంతో గౌరవించే తన తండ్రి నుంచి వేరుపడి, చెడ్డపేరు తెచ్చుకోవడం, పెద్ద కొడుక్కు యిష్టం లేకపోయింది. అల్లుడు, చిన్నకొడుకు, కూతురు, భార్య కూడా వైద్యుడిపై జాలిపడి, దివాకరుణ్ణి శాప నార్థాలు పెట్టారు.

ఈ విధంగా, ఒక మాసం రోజులు గడిచాయి. అప్పుడు దివాకరుడు వైద్యుణ్ణి పిలిచి, "తర్వాత నేను మోసం చేశానను కుంటారు; ముందుగానే చెబుతున్నాను. నేను, మీకు వైద్యానికిగాను, ఒక్కవరహా కూడా యివ్వను," అన్నాడు.



వైద్యుడు తెల్లబోయి, "తమరు, నన్ను మోసగించారా ?" అని అడిగాడు.

"మోసం నాదికాదు; మీది. నాకు సామాన్యమైన జబ్బు వస్తే, భయపెట్టి, బాగా డబ్బు గుంజాలనుకున్నారు. అందుకే నేను, మీకు ఆశపెట్టాను," అన్నాడు దివాకరుడు.

"నిజంగా మీది ప్రమాదకరమైన జబ్బు. నా మందులవల్లనే, అది నయమవుతున్నది," అన్నాడు వైద్యుడు.

దివాకరుడు, వైద్యుడికి కొన్ని సీసాలు తిరిగియిస్తూ, "మీరిచ్చిన మందులన్నీ, వీటిలో వున్నవి. ఒక్కటి కూడా నేను వాడలేదు. చూసుకోండి!" అని చెప్పాడు.

వైద్యుడామందుల్ని పరిశీలించి, దివాకరుడు చెప్పింది నిజమేనని గ్రహించి, ఆశ్చర్యపడి, "నేను, మీకు అబద్ధం చెప్పానని తెలిసి కూడా, నాచేత యింత కాలమెందుకు వైద్యం చేయించుకున్నారు ?" అని అడిగాడు.

అందుకు దివాకరుడు పెద్దగా నవ్వి, "మీరు మంచివారని, నాకు తెలుసు. నా నుంచి యాభైఅయిదువేల వరహాలు రాబట్టాలనుకున్నారంటే, అర్థమేమిటి ? మీరు బాగా డబ్బవసరంలో వుండి వుండాలి; లేదా మీ ఇంట్లో వాళ్ళు,

మీ ఆశను పెంచివుండాలి. అందుకే, మిమ్మల్ని తరచుగా నావద్దకు రప్పించుకుని, మీ సమస్యలడిగి తెలుసుకుని, ఒక్కొక్క సమస్యకూ పరిష్కారమార్గం చెప్పాను. ప్రతి మనిషీ కూడా ఆశా మోహంలో పడి, తన సమస్యలకు పరిష్కారం, ఇతరులను దోచడంలో వున్నదనుకుంటాడు. నిజానికి సమస్యలు పెద్దవికావు. మన ఆశ వాటిని పెద్దవిగా మార్చివేస్తుంది. అలాంటి మనిషి తను సుఖపడడు; ఇతరులను సుఖపెట్టడు," అన్నాడు.

వైద్యుడు వెంటనే దివాకరుడికి, రెండు చేతులూ జోడించి నమస్కరించి, "బాబూ, యింతకాలం తమరు రోగి, నేను వైద్యుడు, అనుకుంటూ వచ్చాను. నిజానికి రోగిని, నేను. తమరు నాకు అద్భుతమైన చికిత్స చేశారు. అందుకు ప్రతిఫలంగా, మీకు ఎన్నిలక్షల వరహాలైనా యిచ్చుకోవచ్చు. నేనే, మీకు బాకీ పడ్డాను," అన్నాడు.

దివాకరుడు నవ్వి, "ఆ మాత్రం తెలుసుకుంటేచాలు! నేను బాగా గుండె దిటవుగలవాణ్ణి; ఆలోచనాశక్తిగలవాణ్ణి. అట్టే డబ్బు లేని మీరు, నా గురించి ముందుగా యాభైఅయిదువేల వరహాలు, ఎలా పెట్టుబడిపెట్టి మందులు తయారు చేయగలరా, అని ఆలోచించాను. నా మందుల గురించి, మీ కెంతో ఖర్చవదనీ, మీరు డబ్బు కోసం, నాకు లేని జబ్బు చెబుతున్నారనీ గ్రహించాను. ఇక మీదట, మీరెవరికీ లేని జబ్బులు చెప్పకండి. కొందరు నిజమని నమ్మి మానసికంగా కృంగిపోయి, లేని జబ్బును నిజంగానే తెచ్చుకోగలరు. జీవితంలో డబ్బును మించినది మానవత్వం. ఈ విషయం గ్రహిస్తే, డబ్బే మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తుంది," అని, పదివేలవరహాలు వైద్యుడికి కానుకగా యిచ్చి పంపాడు.

దివాకరుడు చెప్పినట్టే, ఆ పైన వైద్యుడి ఆదాయం బాగా పెరిగి, ఆయన గ్రామంలోని సంపన్నులలో ఒకడయ్యాడు.






కొన్నివేల సంవత్సరాల కిందట, ఎత్తయిన పర్వతాలూ, అరణ్యాల మధ్య బంగారు లోయ అనే రాజ్యం వుండేది. ఆ పర్వతాల వెనక మరికొంత ఎత్తయిన పర్వతశ్రేణీ, దానిని చుట్టి మరింత ఎత్తయిన మరొక పర్వతవలయం వుండేవి. దానిపైన వున్న మహావృక్షాలు మేఘాలమధ్య తేలియాడు తున్నట్టు కనబడేవి.

ఆ రాజ్యంలోని ప్రజలు, తమ తమ వృత్తుల్లో కష్టపడి పని చేస్తూ తృప్తిగా వుండేవాళ్ళు. అయితే, కొద్ది మందికి మాత్రం తృప్తీ, సుఖాలంటూ వుండేవి కావు. వాళ్ళు మరింత సుఖంకోసం తపనపడు తూండేవాళ్ళు. వాళ్ళెవరంటే—ఆ దేశపు రాజూ, ఆయన ఆస్థాన ఉద్యోగులూ.

రాజు, ప్రజల యోగక్షేమాలు గమనించేందుకు, కొందరిని నియోగించాడు. వాళ్ళు సభతీరి, రాజుగారి క్షేమమే, దేశ క్షేమం అని తీర్మానించారు. రాజుకు, వాళ్ళ తెలివితేటలు అద్భుతం అనిపించింది. దానితో ఆయన పరమానందంచెంది వాళ్ళకు పూర్వం వున్న జ్ఞానులు అన్న బిరుదును మార్చి, మహాజ్ఞానులు అన్న బిరుదులిచ్చాడు.

తర్వాత, ఆ మహాజ్ఞానులు సమావేశమై, రాజుగారికి అన్నీ వున్నా వినోదం కొరవడిందని తీర్మానించి, ఇక నుంచి ఆస్థాన గాయకులు, తలకిందులుగా నిలబడి పాటలు పాడవలసిందిగా శాసించారు. గాయకులు చేసేదిలేక అలా

మనోజ్ దాస్



పాడుతున్నప్పుడు, రాజు సంతోషంతో పొట్ట చెక్కలయ్యేలా నవ్వేవాడు.

రాజూ, ఆస్థానోద్యోగులు ఎలా వున్నా, ప్రజలు మాత్రం చాలా శాంత స్వభావులు. వాళ్ళు కోట వెనక వున్న పర్వతం కేసి చూస్తూ, బాధతో నిట్టూర్చేవాళ్ళు. ఆ పర్వతం పేరు మీదుగానే, ఆ రాజ్యానికి బంగారు లోయ అన్న పేరు వచ్చింది.

ప్రజలలో ప్రచారమవుతున్న వదంతుల ప్రకారం, ఆ పర్వతంలోని, ఒకానొకచోట గొప్ప బంగారుగని వున్నది. ఒకానొకప్పుడు, బంగారులోయ రాజ్యాన్ని గుణవంతుడూ, ధర్మపరుడూ అయిన ఒక రాజు పాలించాడు. ఆయన చిత్రకారుడే కాక, గొప్ప శిల్పి. ఆయన తరచుగా ధ్యానసమాధిలో వుండేవాడు. అలాంటి ఒక తరుణంలో, ఆయనకు, ఆ బంగారుగని ఎక్కడ వున్నదో సూచనప్రాయంగా తెలిసింది.

ఆ రాజశిల్పి కొంత బంగారాన్ని పోగు చేసి, దానితో ఒక అద్భుత సౌందర్యవతి యైన స్త్రీ విగ్రహాన్ని తయారు చేశాడు. రాజ్యప్రజలందరికీ, ఆ విగ్రహాన్ని ఒక శుభదినాన చూసేందుకు వీలు కలిగిస్తానని, రాజ్యంలో చాటింపు వేయించాడు. అయితే, దుష్టుడైన ఆయన మంత్రి కారణంగా, రాజ్యం అల్లకల్లోలమైంది.

మంత్రికి సింహాసనంతోపాటు, బంగారు గనిని కూడా తనదిగా చేసుకోవాలనే దురాశకలిగింది. అతడు పొరుగురాజుతో కుట్రపన్ని, ఒక రాత్రివేళ కోట మీద దాడి చేశాడు. కోట రక్షకభటులు శత్రువులను ఎదిరించారు. పోరు ప్రారంభమైంది.

అలాంటి సమయంలో, ఒక వింత జరిగింది. హఠాత్తుగా భూమి కంపించి, కోట వెనుక వున్న పర్వతం బద్దలై, దాని రాళ్ళు కోట మీదికి వచ్చిపడి, కోటను ధ్వంసం చేసినై. కోటతోపాటు, అక్కడ యుద్ధం చేస్తున్నవాళ్ళు దుర్మరణం పాలయారు. మంత్రీ, అతడి వెంట వచ్చిన శత్రుదేశపు సైనికులూ కూడా ప్రాణాలు కోల్పోయారు.

సూర్యోదయంతర్వాతరాజశిల్పి,ఆయన తయారు చేసిన బంగారుయువతి విగ్రహం కనిపించకుండా పోయినై. రాజు ఎటో పారిపోయి వుంటాడనీ, విగ్రహం రాళ్ళతో కప్పబడిందనీ, ప్రజలు అనుకోసాగారు.

ఆ తర్వాత కొన్ని సంవత్సరాలపాటు, దాపులనున్న అరణ్యంలో, తమ రాజు పోలికలున్న, ఒక మునిని చూసినట్టు కొందరు చెప్పసాగారు. అయితే, ఎవరికీ ఆయనను సమీపించి మాట్లాడడం సాధ్య పడలేదు. మరి కొందరి ఊహప్రకారం రాజు, కోట వెనక వున్న జలపాతంలో నుంచి పెద్ద గుహ దాటి, అవల ఎన్నో ఆమడలదూరంలో వున్న సముద్రం కేసి పోయివుంటాడని. వాళ్ళు జలపాతం, దాని చాటున వున్న గుహ గురించి చెప్పుకోవడమే గాని, ఎవరూ దాన్ని దాటి అవలకుపోవడం అంటూ జరగలేదు. ఒకవేళ ఎవరైనా అలాంటి ప్రయత్నం చేస్తే, ప్రాణాలతో 'తిరిగిరావడం సాధ్య పడదన్న నమ్మకం వాళ్ళకుండేది.

బంగారులోయ రాజ్యం దుష్టమంత్రికి సాయం చేసిన పొరుగుదేశపు రాజు అధీనం లోకి వెళ్ళింది. ఆ రాజుకు బంగారులోయ లోని ప్రకృతి సౌందర్యంతోపాటు, అక్కడ లభించబోయే బంగారం మీద-కూడా ఆశ పుట్టింది. ఆ కారణంగా, రాజ్యాన్ని



తమ్ముడి పరం చేసి, బంగారులోయలోని పాత రాజభవనానికి దూరంగా, మరొక రాజభవనం నిర్మింపచేశాడు.

భూకంపంవల్ల కూలిపోయిన పాత కోటనూ, రాజభవనాన్ని క్రమంగా చెట్టూ చేమలూ, పొదలూ ఆక్రమించినై. ప్రజలు ఆ ప్రాంతానికి వెళ్ళడానికి భయపడే వాళ్ళు. ఆ ప్రదేశమంతా రాత్రివేళలే కాక, పగటివేళ కూడా భూతప్రేతాలు తిరుగాడు తున్నవన్న వదంతులుండేవి. విషసర్పా లకూ, ఎలుగుబంట్లకూ, పులులకూ, ఆ పరిసరాలు నివాస యోగ్యంగా మారినై.

అయితే, వినోదుడు అనే యువకు డొకడు, ఆ ప్రాంతాల నిర్భయంగా తిరుగు



తూండేవాడు. అతడు పసితనంలో నే తల్లిని కోల్పోయాడు. తండ్రి తాను చేసే వృత్తిలో మంచి నేర్పరి. అతడికి కొడుకును గురించిన ఆలోచనే వుండేదికాదు. ఆ కారణంవల్ల, వినోదుడు ఎవరూ తేరి పారచూడని, ఆ భయంకరమైన శిథిల ప్రాంతాల తిరుగుతూండేవాడు. ఒక్కొక్కసారి ఆకలిగొన్న పులి నుంచీ, కాటువేయనున్న విషసర్పాన్నుంచీ, ఎంతో ఒడుపుగా ప్రాణరక్షణ చేసుకునేవాడు.

ఒకనాటి సాయంకాలం, హఠాత్తుగా పడమటి ఆకాశం ఎర్రనైపోయింది. గాలి స్తంభించిపోయింది. వందలకొలది అరణ్య జంతువులు గర్జనలూ, అరుపులూ ప్రారంభించినై. కొద్దిసేపటి తర్వాత, పెను గాలులు లేచి అరణ్యప్రాంతమంతా ఫేళఫెళారావాలతో మోగసాగింది.

పొలాల్లో పని చేసేవాళ్ళూ, వీధుల్లో తిరిగే ప్రజలూ భయకంపితులై పరిగెత్తసాగారు. లోయ అంతా ఒకసారి దద్దరిల్లిపోయింది. అది ఒక పెద్ద భూకంపం. పాతకాలపునాటి రాజుగారి కోట ప్రాంతమంతా, భూకంపం తాకిడికి చిన్నాభిన్నమైపోయింది. అక్కడ పైకెగిరిన బండరాళ్ళు కొన్ని, కొత్త రాజుగారి కోట మీద పడి, కోటకొమ్ము విరిగి శబ్దంతో నేలకూలింది.

రాజు బెదిరిపోయి, తాను నియోగించిన మహాజ్ఞానులందరికీ కబురు చేసి పిలిపించాడు. ఆయన వాళ్ళతో, "కోటకొమ్ము నేలరాలిందంటే, దానిని కట్టినవాళ్ళ తలలు కూడా నేల రాలవలసిందే!" అన్నాడు కోపంగా.

అందుకు ప్రధానమంత్రి, "చండమార్తాండ, ప్రభో! ఈ కోటనూ, రాజప్రాసాదాలనూ కట్టినవాళ్ళు, ఎన్నో తరాల కిందటివాళ్ళు. వాళ్ళిప్పుడు బతికిలేరు." అని జవాబిచ్చాడు.

"అయితే ఏం? అప్పు తీసుకున్నవాడు మరణిస్తే, ఆ బాకీని వాడి వారసులు చెల్లించాలి గదా? నేను శుంఠనేంకాదు," అన్నాడు రాజు.

"మేం మహాజ్ఞానులం మాత్రమే. మీరు మహా మహా జ్ఞానులు, మహారాజా!" అన్నాడు ప్రధానమంత్రి.



ఇప్పటి యువకుడైన వినోదుడి తాత గారు, ఆ కోట నిర్మాణానికి సాయపడిన శిల్పి, ప్రధాన వాస్తుశాస్త్రజ్ఞుడూ కావడంతో, భటులుపోయి వినోదుడి తండ్రిని పట్టి బంధించి తీసుకువచ్చి, మహారాజు ముందు నిలబెట్టారు.

"తల కొట్టెయ్యండి!" అని రాజు ఆజ్ఞాపించాడు.

అప్పుడు ఆస్థానోద్యోగి ఒకడు వినయంగా, "మహారాజా, విరిగి నేలకూలిన అంత పెద్ద కోటకొమ్ముకు, వీడి యింత చిన్న తల కొట్టించడం సరి అయిన శిక్ష కాదు," అన్నాడు.

ఆ ఉద్యోగికి వినోదుడి తండ్రి మీద జాలికలిగింది.

"అయితే, ఏం చెయ్యమని, నీ సలహా?" అని రాజు అడిగాడు.

"ఒక్క వెయ్యి సంవత్సరాల జైలు శిక్ష విధించండి," అన్నాడు రాజోద్యోగి.

"ఆహాఁ, వెయ్యి సంవత్సరాల శిక్ష! అమోఘం!" అన్నాడు రాజు పెద్దగా చప్పట్లుచరుస్తూ.

ఆ విధంగా వినోదుడి తండ్రి జైలు పాలయ్యాడు. ఇది చూసి వినోదుడు చాలా వ్యాకులపడ్డాడు. అతడికి, ఆ తండ్రి తప్ప నా అన్నవారింకెవరూలేరు. క్రూరమైన, యీ శిక్ష విధించిన మహారాజును, అంతమందిలోనూ బాగా దుర్భాషలాడాలనుకున్నాడు, వినోదుడు. కాని అతడి మంచికోరే వాళ్ళు, సర్ది చెప్పారు.

"వినోదా, నువ్వు కోపం కొద్దీ, మహారాజును ఏమైనా దూషించావో, నీకూ నీ తండ్రికి పట్టిన దురవస్థే పడుతుంది. తొందరపడకు, ఏదో విధంగా, నీ తండ్రి విడుదలయ్యేలా చూస్తాం," అన్నారు వాళ్ళు.

అయితే, వినోదుడి తండ్రి సంవత్సరం తిరక్కుండానే జైల్లో మరణించాడు.



ఈ వార్త విన్న రాజు దిగులుపడి పోతూ, "ఆ నేరస్థుడు, తొమ్మిదివందల తొంభైతొమ్మిదిరోజుల జైలుశిక్ష తప్పించుకో వాలని చూశాడు, అవునా?" అని మంత్రు లను అడిగాడు.

వాళ్ళల్లో ఒకడు, "మహారాజా, నాదొక సలహా. తండ్రి ఆస్తికి కొడుకు వారసు డయినప్పుడు, అతడి జైలుశిక్షకు మాత్రం ఎందుకు వారసుడు కాడు?" అన్నాడు.

"భళిభళీ, మంత్రీ! ఆ చచ్చినవాడి కొడుకును తక్షణం పట్టి జైల్లో పారె య్యండి!" అన్నాడు రాజు.

అయితే, యీ ఆజ్ఞ గురించి విన్న వినోదుడు, భటులు తనను పట్టుకోవ డానికి వచ్చేలోపలే, అరణ్యం కేసి బయలుదేరాడు.

అతడు అరణ్యం చేరేసరికి బాగా చీకటి పడిపోయింది. అయినా, వినోదుడికి అక్కడి చెట్లలో, తుప్పల మధ్యగా నడిచి పురాతన శిథిలాలను చేరడం బాగా అలవాటే. అతడు ఆ ప్రాంతాన్ని చేరి, తరచుగా తను కూర్చునే ఒక పెద్ద బండ రాయి మీదకి వెళ్ళి కూర్చున్నాడు. ఆ సరికి చంద్రోదయమై, అరణ్యమంతా వెన్నెలకాంతి ప్రసరించింది. వినోదుడు తన తండ్రి మరణానికి చాలాసేపు దుఃఖించి సొమ్మసిల్లి కళ్ళు మూశాడు.

కొంతసేపటికి అతడికి మెలకువ వచ్చింది. అతడు కళ్ళు తెరిచేసరికి, ఎదురుగా ఒక వెలుగు కనిపించింది. అది చంద్రకాంతి కాదు. అక్కడ ఎగుడు దిగుడుగా వున్న కొండరాళ్ళు తప్ప, వినోదుడు లోగడ మరేమీ చూసివుండలేదు.

అయితే, యిప్పుడు ఆ ప్రదేశాన ఒక గుహ అతడి కంటబడింది. ఆ గుహలో తళతళ మెరిసిపోతున్న ఆకారం ఒకటి నిలిచివున్నది. వినోదుడు అటు కేసి నడవసాగాడు. అతడు గుహను చేరేసరికి, లోపల ఒక బంగారు స్త్రీమూర్తి, చేతిలో ఒక తామరపువ్వుతో, నిలబడి వుండడం చూసి అత్యాశ్చర్యం పాలయ్యాడు.

ఆ వెంటనే అతడికి బంగారులోయ గురించి, తాను విన్న పురాతన గాథ గుర్తుకు వచ్చింది. ఈ బంగారుస్త్రీ విగ్రహం, అలనాడు శిల్పకళలో ఆరితేరిన రాజు చేసినదై వుండాలి! భూకంపంవల్ల, అది కొండరాళ్ళ నుంచి బయటపడింది!

వినోదుడు ఆ విగ్రహం కేసి పరీక్షగా చూడసాగాడు. కొద్దిసేపట్లో, అతడికి ఆ విగ్రహాన్ని తాను ముందే చూసి వున్నానన్న అనుమానం కలిగింది. కాని, అతడికది నమ్మశక్యంగా కనిపించలేదు. పాత రాజరికం పోయి, కొత్తవాళ్ళు బంగారులోయను ఆక్రమించినతర్వాత, రాజ్యంలో కళలను ప్రోత్సహించడం జరగలేదు.

వినోదుడు విగ్రహాన్ని తాకి చూశాడు. ఆ క్షణంలో అతడికి కలిగిన ఆనందం అంతాయింతా కాదు. అతడు తన్మయుడై పోతూ విగ్రహం చేతిలో వున్న తామర పువ్వు మీద చేయి వేశాడు. ఆ సమయంలో విగ్రహం వేలికున్న ఉంగరం ఒకటి జారి, అతడి వేలును చేరింది.

వినోదుడు ఉంగరం కేసి చూసి నిర్ఘాంతపోయాడు. తర్వాత అతడికి ఎంతో ఆనందం కలిగింది. అతడు విగ్రహం కేసి కన్నార్పకుండా చూస్తూ, ఉన్నచోటునే కూర్చున్నాడు. ఆ మరుక్షణం, అతడిని మత్తులాంటిది ఆవహించింది.

ఆ స్థితిలో అతణ్ణి ఒక కంఠస్వరం హెచ్చరిస్తూ, "ఈ బంగారు విగ్రహానికి ప్రాణం వచ్చే రహస్యం తెలుసుకోవాలని వున్నదా?" అని అడిగింది.

"అవును, తెలుసుకోవాలని వున్నది!" అన్నాడు వినోదుడు ఉత్సాహంగా.

"అలా అయితే, విగ్రహరక్షణకు తగు ఏర్పాట్లు చేసి, జలపాతం వెనక వున్న గుహలో ప్రవేశించు. గుహ దాటిన తర్వాత, ఒకానొక కొత్త ప్రదేశాన, నువ్వొక దేవతను చూస్తావు. ఆ దేవత ద్వారా రహస్యం నీకు తెలుస్తుంది. ఈ బంగారు విగ్రహం జీవం గల కన్య అయాక, ఆమెను వివాహమాడేందుకు వరం కోరు," అన్నదా కంఠస్వరం. —(ఇంకావుంది)





# గంధర్వుడి శాపాలు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, అర్ధరాత్రివేళ, ఈ శ్మశానంలో ఎన్నో కష్టాల కోర్చుతూ కూడా, పట్టువదలని నీ ధైర్యసాహసాలు మెచ్చదగినవే. పట్టుదలతో సాధించరాని కార్యం లేదనే మాట నిజం. కాని, ఆ సాధించినది స్వప్రయోజనానికి గానీ, పరులమేలుకు గానీ ఉపయోగించక పోవచ్చు. స్వతహాగా ఎన్నో అద్భుత శక్తులూ, మహిమలూ గల గంధర్వుల వంటివాళ్ళే, ఒక్కొక్కసారి భంగపాటుకు గురి అవుతూంటారు. ఇందుకు ఉదాహరణగా, చిత్రవర్ణుడు అనే గంధర్వుడి కథ చెబుతాను, శ్రమతెలియకుండా, విను.'' అంటూ యిలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



చిత్రవర్ణు డనే గంధర్వుడు, భూలోక సౌందర్యం గురించి, కొందరు గంధర్వులు చెప్పుకుంటూ వుండగా విని, స్వయంగా చూడదలచి, భూలోకానికి బయలు దేరాడు.

ఆకాశయానం చేస్తూ, భూలోకానికేసి వస్తున్న చిత్రవర్ణుడికి, ఒకచోట అందమైన ఉద్యానవనం ఒకటి కనిపించింది. అతడు, ఆ ఉద్యానంలోని, ఒక పొదరింటి పక్కన దిగాడు.

చిత్రవర్ణుడు ఉద్యానవన సౌందర్యం చూసి ముగ్ధుడైపోయి, చుట్టూ కలయ చూస్తున్నంతలో, ఒకచోట కొందరు యువతుల మధ్య, ఒక అద్భుత సౌందర్యరాశి కంటబడింది. అంతటి సౌందర్యవతిని, అతడు గంధర్వలోకంలో కూడా ఎప్పుడూ చూడలేదు.

చిత్రవర్ణుడు, ఆ యువతులకేసి నడిచాడు. అతణ్ణి చూస్తూనే వాళ్ళంతా ఆశ్చర్యపోయారు. అతడు వాళ్ళ మధ్య వున్న సౌందర్యవతి కేసి చూస్తూ, "సుందరీ! నేను చిత్రవర్ణు డనే గంధర్వుణ్ణి. నీవంటి సౌందర్యరాశిని, మా గంధర్వలోకంలో కూడా నేను ఇంతకు ముందెన్నడూ చూడలేదు. ఎవరు నీవు?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు, అక్కడ వున్న యువతుల్లో ఒకామె, "ఈమె, శరశ్చంద్రికారాజ్యపు యువరాణి నలందాదేవి," అని జవాబిచ్చింది.

"అలాగా! మీ యువరాణిని, మా గంధర్వలోకానికి తీసుకుపోతాను," అంటూ చిత్రవర్ణుడు, యువరాణి చేయి పట్టుకున్నాడు.

వెంటనే యువరాణి భీతితో పెద్దగా కేక వేసింది. ఒక భటుడు అక్కడికి పరుగునవచ్చి, గంధర్వుడిపై కత్తి దూశాడు.

అది చూసి చిత్రవర్ణుడు ఫక్కున నవ్వి, "పాపం, నేనెవరో తెలియక కత్తి దూసి వుంటావు, అవునా?" అని అడిగాడు.

"నేను యువరాణి రక్షణకు నియమించబడ్డ భటుణ్ణి. హద్దుమీరి ఆమె చేయి పట్టుకున్న నీ వెవరివైనా, తప్పక బంధించితీరుతాను." అన్నాడు భటుడు కోపంగా.

ఆ జవాబుకు చిత్రవర్ణుడు ఉగ్రుడై పోయి, "ఓరీ, నరాధమా! నేను అద్భుతమైన శక్తులు గల గంధర్వుణ్ణి. నా మీద కత్తి దూసిన నిన్ను శిక్షించక వదలను. నువ్వు, చేతులు లేని అవిటివాడివవుదువు గాక!" అని శపించాడు.

అయితే, చిత్రవర్ణుడి శాపం భటుణ్ణి ఏమీ చేయలేకపోయింది. భటుడు పట్టరాని కోపంతో కత్తిని పైకెత్తి, చిత్రవర్ణుడి కంఠం మీద కొట్టబోయాడు. కాని, చిత్రవర్ణుడు, యువరాణి చేయి వదిలి మెరుపులా మాయమైపోయాడు.

తన శాపం, ఒక సామాన్యభటుణ్ణి ఏమీ చేయలేకపోవడం, చిత్రవర్ణుడికి చాలా ఆశ్చర్యకారణమయింది.

ఆ తర్వాత చిత్రవర్ణుడు కొంతదూరం ప్రయాణించి, చీకటి పడేవేళకు, ఒక అరణ్యాన్ని చేరాడు. అతడు అక్కడ కొద్దిదూరం నడిచేసరికి, ఒక కొండ గుహలో నుంచి వెలుగురావడం కంటబడింది. ఆ వెలుగుకు కారణం ఏమిటా అని, చిత్రవర్ణుడు గుహ ముందుకు పోగా,



గుహ మధ్య వేలాడకట్టి వున్న, ఒక మణి కనిపించింది.

అంత గొప్ప కాంతులను వెదజల్లే మణిని, చిత్రవర్ణుడు యింతవరకూ చూసి వుండలేదు. ఆ మణిని తన లోకానికి తీసుకుపోయి, గంధర్వరాజుకు కానుకగా యివ్వాలనుకుంటూ, అతడు గుహ లోపలికి పోబోయాడు.

అయితే, అంతలో వెనక నుంచి, "ఎవడురావాడు!" అన్న భీకరమైన కంఠస్వరం వినిపించింది.

చిత్రవర్ణుడు వెనుదిరిగి చూశాడు. అతడికి, ఒక భీకరాకారుడైన రాక్షసుడు కనిపించాడు. వాడు, చిత్రవర్ణుడి కేసి

గుర్తురుముతూ, "ఏం పని మీద, నా గుహ లోకి వెళ్ళబోయావు ?" అని అడిగాడు.

చిత్రవర్ణుడు ఏ మాత్రం తొట్రుపడకుండా, "అద్భుతమైన అంత వెలుగునిచ్చే మణి, నాకు నచ్చింది. దాన్ని తీసుకునేందుకు వెళ్ళబోయాను," అన్నాడు.

"పరులసొమ్ము దోచుకోచూసే, నీలాంటి గజదొంగను ప్రాణాలతో వదలను. నిన్నిప్పుడేపట్టి, నమిలిమింగబోతున్నాను," అంటూ రాక్షసుడు, చిత్రవర్ణుడి కేసి రెండడుగులు వేశాడు.

చిత్రవర్ణుడు బిగ్గరగా నవ్వి, "ఓరీ, రాక్షసాధమా! నేను అద్భుతశక్తులు గల గంధర్వుణ్ణి. నన్ను నీవేమీ చేయలేవు. నేనుకావాలనుకుంటే, నిన్నుశవప్రాయుణ్ణి చేయగలను. ప్రాణాలతో వుండదలిస్తే, తక్షణం, ఆ మణిని నీ చేతులతో స్వయంగా తెచ్చియిచ్చి, క్షమాపణ కోరుకో!" అన్నాడు.

ఆ మాటలకు రాక్షసుడు పెద్దగా హుంకరించి, "ఒరే, డంభాలు పలకకు! ఇప్పుడే నిన్ను, నా గుప్పెటపట్టి, నీ ఎముకలు చూర్ణం చేస్తాను," అంటూ చిత్రవర్ణుడి మీదకి వచ్చాడు.

చిత్రవర్ణుడు, రాక్షసుడికి అందకుండా చప్పున గాలిలోకి లేచి, "ఒరే, నువ్వు ప్రాణం వుండీ కదలలేని బొమ్మగా మారిపో!" అని శపించాడు.

కాని, ఆ శాపం రాక్షసుణ్ణి ఏమీ చేయలేక పోయింది. దానితో చిత్రవర్ణుడు



మరింతగా ఆశ్చర్యపోయి, బహుశా తన శాపం భూలోకవాసులకు ఎలాంటి హాని చేయదేమో అనుకున్నాడు.

ఆ అరణ్యంలో మరి కొంతదూరం పోయేసరికి, చిత్రవర్ణుడికి ఒక ముసలివాడు దాహంతో అలమటిస్తూ కనిపించాడు. ఆ సమీపంలో ఎక్కడైనా నీరు దొరుకుతుందేమో అని చిత్రవర్ణుడు వెదికాడు. ఎక్కడా నీరు దొరకలేదు.

ఆ సమయంలో చిత్రవర్ణుడికి, ఒక చెట్టు కింద తపస్సు చేసుకుంటున్న ముని కంటబడ్డాడు. చిత్రవర్ణుడు, ఆయన దగ్గరకు పోయి, చేతులు జోడించి నమస్కరించి, ''స్వామీ, యీ సమీపంలో, ఒక ముసలివాడు దాహంతో గొంతు ఎండి బాధపడుతున్నాడు. తమ కమండలంలోని జలం, కొద్దిగా యివ్వగలరా?'' అని అడిగాడు.

ముని కళ్ళు తెరుస్తూనే, చిత్రవర్ణుడి కేసి కోపంగా చూస్తూ, ''ఓరీ, దురహంకారీ! తపోధ్యానంలో వున్న నన్ను పలకరించి, తపోభంగం కలిగిస్తావా? నీకు తగిన శాస్తి చేస్తాను!'' అని, కమండలంలోని జలాన్ని దోసిట పోసుకున్నాడు.

చిత్రవర్ణుడు వినయంగా, ''స్వామీ, ఆగ్రహించకండి! దప్పికతో వున్న, ఒక ముసలివాడి కోసం, మీకు ధ్యానభంగం చేయవలసివచ్చింది,'' అన్నాడు.

''కారణం ఏదైనా కానీ, నీ తప్పుకు శిక్ష తప్పదు,'' అని, ముని కమండల



జలాన్ని చిత్రవర్ణుడి మీదికి చల్లుతూ, ''నువ్వు మూగవాడివై పోదువుగాక!'' అన్నాడు.

ముని శాపం చిత్రవర్ణుడికి ఎలాంటి హానీ కలిగించలేదు. చిత్రవర్ణుడు ముని అహంకారానికి కోపగించి, కుడిచేతిని గాలిలో తిప్పుతూ, ''నువ్వు బండరాయివై పోవుదువుగాక!'' అని శపించాడు.

ఆ మరుక్షణం, ముని బండరాయిగా మారిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, మహాశక్తి సంపన్నులైన గంధర్వుల జాతికి చెందిన చిత్రవర్ణుడి శాపాలు ఒక సామాన్య భటుడి మీదా, రాక్షసుడి మీదా పని చెయ్యలేదు. కాని, తపస్సు చేసుకునే ఒక ముని, అతడి శాపానికి గురి అయ్యాడు. ఆ భటుడూ, రాక్షసుడూ ఏమైనా అద్భుతశక్తులు కలవాళ్ళా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''చిత్రవర్ణుడు, సహజంగా తనకున్న మహత్తరమైన శక్తులను, అతిహీనంగా తన స్వార్థానికే ఉపయోగించదలచాడు. అతడు రాకుమార్తెను చెరబట్టబోవడమే గాక, తన విధినిర్వహణలో, ఆమె రక్షణకైవచ్చిన భటుణ్ణి శపించాడు. ఆ కారణంవల్లనే, అతడి శాపం విఫలమయింది. అదే విధంగా, రాక్షసుడిదైన దివ్యమణిని తస్కరించబోయి, దాని యజమానిని ఘోరంగా శపించాడు. ఇది అధర్మకార్యం గనక, చిత్రవర్ణుడి శాపం రాక్షసుడికి ఎలాంటి హానీ చేయలేకపోయింది. ఇకపోతే, ముని విషయంలో గంధర్వుడి శాపం ఫలించడానికి కారణం, అతడిలోని దయాగుణం, మునియొక్క అహంకారం, అధర్మప్రవృత్తి. అంతేకాని భటుడికీ, రాక్షసుడికీ అద్భుతశక్తులుండడం కాదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# నిలబడిన పద్ధతి

కోసలరాజు శైలేంద్రవర్మకు, ఒకనాడు తన ఆస్థాన విదూషకుడైన శకటుడి మీద చాలా కోపం వచ్చింది. ఆయన శకటుణ్ణి, యిక ఏనాడూ తనకు ముఖం చూపవద్దని శాసించి పంపివేశాడు.

శకటుడి దురదృష్టం అంతటితో పోలేదు. అదే రోజున విదర్భదేశం నుంచి దామోదరు డనే విదూషకుడు వచ్చి, శైలేంద్రవర్మను దర్శించాడు. అతడి మాటలు వినగానే, శకటుడి మీద మంచి కోపంలో వున్న రాజుకు, దామోదరుణ్ణి ఆస్థానవిదూషకుడుగా ఎందుకు నియమించకూడదూ? అన్న ఆలోచన వచ్చింది.

శైలేంద్రవర్మ, మంత్రి మంగళకుడితో, యీ సంగతి చెప్పాడు.

అందుకు మంగళకుడు, "ప్రభూ, శకటుడు ఎప్పుడైనా తమకు కోపం తెప్పించడం, ఆ తర్వాత తన చమత్కృతితో తిరిగి తమను మెప్పించడం, గతంలో చాలాసార్లు జరిగిందే కదా? అతడికి మరొక అవకాశం యివ్వండి!" అన్నాడు.

శైలేంద్రవర్మ ఏమీ మాట్లాడకుండా, అప్పటికి వూరుకున్నాడు.

తర్వాత మంత్రి మంగళకుడు, శకటుడికి కబురంపి, రాజుగారి ఉద్దేశం అతడికి చెప్పి, పదవిపోకుండా కాపాడుకోమని సలహా యిచ్చాడు.

మర్నాడు మంత్రీ, రాజూ ఏవో మంతనాలాడుతూండగా, శకటుడు ఒక నల్లటి ముసుగు ముఖం మీద కప్పుకుని వచ్చి, "మహారాజా, తమరు ముఖం చూపవద్దని ఆజ్ఞాపించడంవల్ల, యిలా ముసుగుతో రాక తప్పలేదు. కాని, తమరు నన్ను మాట్లాడకూడదని శాసించలేదు కదా! దేవరవారు, నా విదూషకపదవిని, మరెవరికో కట్టబెట్టాలన్న ఆలోచనలో వున్నట్టు

జొన్నలగడ్డ రత్న

తెలిసింది. ఎంతో కాలంగా, తమను ఆశ్రయించి బతుకుతున్న వాణ్ణి. నన్ను విదూషకపదవి నుంచి తొలగించవద్దని ప్రాథేయపడుతున్నాను,'' అన్నాడు.

శైలేంద్రవర్మ, శకటుడి ముసుగు చూసి వస్తున్న నవ్వును ఆపుకుంటూ, ''విదర్భ దేశం నుంచి వచ్చిన దామోదరుడు, అన్ని విధాలా మాకు ఆస్థాన విదూషకుడుగా వుండతగ్గవాడన్న అభిప్రాయం కలిగింది. అయితే, నీ స్థానం నిలబెట్టుకోదలిస్తే, నీకు మరొక అవకాశం యివ్వడానికి, మాకేలాంటి అభ్యంతరం లేదు,'' అన్నాడు.

''మహాప్రసాదం! అందుకు నేను చేయవలసినదేమిటో సెలవివ్వండి,'' అని అడిగాడు శకటుడు.

''అయితే విను! రేపు సభలో, నీ నోటి మీదుగా, దామోదరుడంతటి విదూషకుడు ప్రపంచంలో మరొకడుండబోడని, ఏవేవో చెబుతూ, అతణ్ణి ఆకాశాని కెత్తివేస్తూ పొగడాలి. అలా చెయ్యమన్నాను కదా అని, నిన్ను నువ్వు, ఏమాత్రం కించ పరచుకోకూడదు. అలా మాట్లాడ గలిగే పక్షంలో, నీ పదవి నిలబెట్టుకోగలవు,'' అని చెప్పాడు శైలేంద్రవర్మ.

శకటుడు మర్నాడు రాజసభలో, దామోదరుడిని పొగడుతూ, అతడి లాంటి విదూషకుడు మరొకడుండబోడని చెప్పి, ఒకవేళ మహారాజుగారు, తన లాంటి గొప్ప విదూషకుడి స్థానంలో, మరెవరినైనా నియమించదలిస్తే, అందుకు నిస్సందేహంగా దామోదరుడే తగినవాడని చెప్పాడు.

శకటుడు యిలా ఎందుకన్నాడో అర్థం కాక, సభలోని వాళ్ళందరూ ఆశ్చర్యపోయారు.

రాజు శైలేంద్రవర్మ సంతోషంతో చప్పట్లుచరిచి, ''శకటుడి స్థానం ఎప్పుడూ శకటుడిదే!'' అని సింహాసనం దిగివచ్చి, శకటుణ్ణి కౌగలించుకున్నాడు.

తర్వాత శైలేంద్రవర్మ, విదర్భ నుంచి వచ్చిన దామోదరుణ్ణి సత్కరించి పంపి వేసి, శకటుడికి ఎన్నో బహుమానాలిచ్చాడు.



పిల్లలకు చందమామ నిర్వహిస్తూన్న పోటీలో సరదాగా పాల్గొనండి!

# మహోన్నత భారతీయ సంస్కృతి పోటీ

## ఉత్తేజకరమైన మూడు భాగాలలో

**పోటీ: 1**

గొప్ప భారతీయ రాజులు



**పోటీ: 2**

గొప్ప భారతీయ రాణులు



**పోటీ: 3**

గొప్ప భారతీయ జంటలు



**రూ. 1,30,000 ల విలువకు మించిన బహుమతులు గెలుచుకోండి!**

11 భాషలలో ప్రతి పోటీకి గొప్ప బహుమతులు:

| | | |
|---|---|---|
| 11 ప్రథమ బహుమతులు | : | 2,000 రూపాయలు స్కాలర్‌షిప్ |
| 11 ద్వితీయ బహుమతులు | : | 1,000 రూపాయలు స్కాలర్‌షిప్ |
| 11 తృతీయ బహుమతులు | : | 500 రూపాయలు స్కాలర్‌షిప్ |

**ఇవిగాక, బంపర్ ప్రైజులు**

| | | |
|---|---|---|
| ప్రథమ బంపర్ | : | 10,000 రూపాయలు స్కాలర్‌షిప్ • |
| ద్వితీయ బంపర్ | : | 5,000 రూపాయలు స్కాలర్‌షిప్ • |
| తృతీయ బంపర్ | : | 2,500 రూపాయలు స్కాలర్‌షిప్ • |

• విజేతలకు ఐదు సమాన వాయిదాలలో

220 కన్సొలేషన్ బహుమతులు: ఒక యేడాదిపాటు చందమామకు ఉచిత చందా

## పాల్గొనడం ఎలా?

మీ చరిత్ర పుస్తకాలనూ, పాత చందమామ కాపీలనూ దగ్గరుంచుకుని, కుటుంబ సభ్యులందరితోపాటు కూర్చుని ప్రారంభించండి! భారతీయ చరిత్రకూ, పురాణాలకూ సంబంధించిన సుప్రసిద్ధ జంటల చిత్రపటాలు కొన్ని ప్రక్కన ఇవ్వబడ్డవి. చిత్రపటాలను జాగ్రత్తగా పరిశీలించి చూసి, అవి ఎవరివో గుర్తించి, వానికి సరిపోయే సంఖ్యను బాక్సులో రాయండి. తరవాత ఇక్కడ వున్న ఆరు చిత్రపటాలలో ఒకదానిని ఎన్నుకుని, ఖాళీని పూర్తిచేసి, పక్క పేజీలో వున్న "నేను....... కథను ఎంతగానో ఇష్టపడతాను. ఎందుకంటే........" అన్న వాక్యాన్ని పూర్తిచేయండి. ఈ వాక్యం పదిహేను మాటలకు మించకూడదు. ఉత్సాహకరమైన చక్కని సమాధానం రాయండి. ఉత్తమ సమాధానాలు బహుమతులు గెలుచుకుంటాయన్న విషయం గుర్తుంచుకోండి! మీ పేరూ, వయసూ, చిరునామా రాసి, పేజీని కత్తిరించి ఎంట్రీఫారాన్ని మాకు పోస్టు ద్వారా పంపండి. ఈ పోటీ ఫలితాలు వచ్చేలోగానే, బంపర్ ప్రైజు సెక్షన్ కోసం రానున్న చందమామ సంచికలో చూడండి.

## పోటీ నిబంధనలు:

1. 16 సంవత్సరాల వయసుకు లోబడిన పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు. ఒకరు ఎన్ని ఎంట్రీలనైనా పంపవచ్చు. అయితే, అవి చందమామలో అచ్చయిన ఎంట్రీఫారాలలో మాత్రమే పంపాలి.

2. ఒకరు ఒక్క పోటీలోగానీ, లేదా మొత్తం మూడు పోటీలలోనూ (గొప్ప భారతీయ రాజులు, గొప్ప భారతీయ రాణులు, గొప్ప భారతీయ జంటలు) పాల్గొని బహుమతులు గెలుపొందవచ్చు. ఇవిగాక, బంపర్ ప్రైజులకు కూడా ప్రయత్నించవచ్చు.

3. ఎంట్రీఫారాలను, స్పష్టమైన దస్తూరీలో, చందమామ ప్రచురింపబడుతూన్న పదకొండు భాషలలో ఏ భాషలోనైనా సరే పూర్తిచేసి పంపవచ్చు.

4. పోటీ: 3 ఎంట్రీఫారాలు డిసెంబర్ 31, 1987 లోగా మాకు చేరాలి.

5. ఎంట్రీలు ఆలస్యంగా అందినా, పోయినా, పాడయినా నిర్వాహకులు బాధ్యత వహించరు.

6. ఎంట్రీలను మామూలు పోస్టు ద్వారా మాత్రమే పంపాలి.

7. చందమామ పబ్లికేషన్స్ ఉద్యోగులూ, హిందూస్థాన్ థాంప్సన్ అసోసియేట్స్ ఉద్యోగులూ, వారి కుటుంబ సభ్యులూ తప్ప తక్కిన భారతీయ పౌరులందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.

8. ఎంట్రీలను పరిశీలించి, ఎన్నికచేయడంలో న్యాయనిర్ణేతల మంతలిదే తుదినిర్ణయం. ఈ విషయంగా ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.

9. విజేతలకు వ్యక్తిగతంగా పోస్టులో తెలియజేయబడుతుంది. వారి పేర్లు చందమామలో ప్రకటించబడతాయి.

**ముఖ్య గమనిక: బంపర్ ప్రైజ్ సెక్షన్**

మీ ఎంట్రీఫారాలు పోస్టుచేసే ముందు, వాటిలో 'చందమామ పోటీ: 3' అని వున్న లేబిల్‌ను కత్తిరించి మీదగ్గరే భద్రపరుచుకోండి. 1, 2 పోటీలకు కూడా అలాగే చేయండి. ఈ మూడు లేబిల్స్‌నూ కలిపి, బంపర్ సెక్షన్ ఎంట్రీఫారం (డిసెంబర్ చందమామ సంచికలో వస్తుంది) మీద అతికించాలి. 3 లేబిల్స్ అతికించబడిన ఎంట్రీ ఫారాలు మాత్రమే బంపర్ ప్రైజు పరిశీలనకు అంగీకరించబడతాయి.

ఈ చందమామ కాపీని భద్రపరచండి. బంపర్ సెక్షన్ ప్రశ్నలు సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్ సంచికలపై ఆధారపడి ఉంటాయి.

గమనిక: మీరు పోటీ: 1, 2 లలో పాల్గొనలేక పోయినప్పటికీ, పోటీ: 3 లో పాల్గొనవచ్చు.

# పోటీ: 3

## (ఎంట్రీఫారం)








ఉదాహరణలో చూపిన విధంగా, ఈ ఆరు జంటల చిత్రపటాలను, సరైన అంకెలను సూచిస్తూ, సరైన పేర్లతో జతచేయండి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| లవుడు-కుశుడు | 1 | సత్యవంతుడు-సావిత్రి | 4 | శకుంతల-దుష్యంతుడు | 7 |
| రాధ-కృష్ణుడు | 2 | అక్బర్-బీర్బల్ | 5 | రాముడు-లక్ష్మణుడు | 8 |
| రాణాప్రతాప్-చేతక్ | 3 | నలుడు-దమయంతి | 6 | విష్ణువు-గరుడుడు | 9 |







ఈ లేబిల్‌ను బంపర్‌ప్రైజు కోసం భద్రపరచండి

బంబర్ ప్రైజుకు (డిసెంబర్ సంచికలో) ప్రయత్నించేప్పుడు, మీరు దీనిని బంపర్ సెక్షన్ ఎంట్రీఫారంమీద అతికించవలసి వుంటుంది.

చందమామ
పోటీ 3

# పోటీ : 3

## (ఎంట్రీఫారం)

ఇప్పుడు, పైనవున్న ఆరు చిత్రపటాల పేర్లలో ఏ ఒక్క జంట పేరునైనా తీసుకుని, 'ఎందుకంటే'.........తరవాత వాక్యాన్ని పూర్తిచేయండి. ఈ వాక్యం పదిహేను మాటలకు మించకూడదు.

"నేను ........................................ కథను ఎంతగానో ఇష్టపడతాను. .........

ఎందుకంటే...............................................................................................

.......................................................................................................................

.......................................................................................................................

మీ పేరు ...............................................................................................

వయసు.............చిరునామా ...........................................................................

.......................................................................................................................

ఈ పేజీని కత్తిరించి, 'చందమామ పోటీ 3' అని వున్న కూపన్‌ను మీ దగ్గరే ఉంచుకుని, ఎంట్రీఫారాన్ని వెంటనే కింది చిరునామాకు పోస్టు చేయండి:

**చందమామ పోటీ 3**
చందమామ పబ్లికేషన్స్
**188, ఆర్కాట్ రోడ్**
**మద్రాసు-600 026**

**పోటీ: 3 ఆఖరుతేది: డిసెంబర్ 31, 1987**

ఈ లేబిల్‌ను బంపర్ ప్రైజు కోసం భద్రపరచండి

**మహోన్నత భారతీయ సంస్కృతి పోటీ**

# మాండూ

1618 వ సంవత్సరంలో జహంగీరు మాండూ ప్రాంత సౌందర్యానికి ముగ్ధుడై, "పచ్చికతో, అందమైన అడవి పువ్వులతో అల్లుకునివున్న మాండూ కొండ, లోయల సౌందర్యాన్ని నా మాటలు ఎలా చెప్ప గలవు?" అని రాసుకున్నాడు. మధ్య ప్రదేశ్‌లోని ఈ సుందర ప్రదేశంలో పారమార రాజులు 13 వ శతాబ్దంలో కోటను నిర్మించి, దానికి మండపదుర్గం అని పేరుపెట్టారు. అదే కాలక్రమేణా మాండూ అయింది.






ఒక రైతు నేలను తవ్వుతూండగా, అతని పారకు ఒక చిన్న రాయి తగిలి, ఆ పార బంగారంగా మారిందట! రైతు ఆ వింతను గ్రహించడానికి ముందే ఒక కమ్మరి, ఆ రాయికి వున్న మహిమను పసికట్టి, రైతుదగ్గరినుంచి దానిని పట్టుకుపోయాడట!

ఆ రాయి మహిమతో కమ్మరి, కావలసినంత బంగారం చేసుకుని, అచిరకాలంలోనే గొప్ప ధనికుడయ్యాడు. తరవాత అతడు ఆ మహిమగలరాయిని, జయసింగుదేవరాజుకు ఇచ్చాడు. ఆ రాయి ప్రభావంతో సృష్టించిన ధన సంపదతోనే రాజు మాండూ కోటను నిర్మించినట్టు చెబుతారు!





రాజుకు సైతం కొంతకాలానికి, ఆ రాయితో సృష్టించుకున్న సంపద చాలనిపించింది. ఒకనాడాయన నర్మదా నదీ తీరంలో, తన వద్ద వున్న బంగారాన్ని, రత్నాలను ప్రజలకు దానం చేశాడు. చివరగా పురోహితుడివంతు వచ్చింది. రాజు అతనికి మహిమ గల రాయిని ఇచ్చాడు. కాని, రాజు దాని మహిమ గురించి చెప్పేలోగా, 'రాయిని ఇచ్చాడే!' అన్న ఆగ్రహంతో పురోహితుడు దానిని నదిలోకి విసిరివేశాడు!

అలా ఆ రాయి శాశ్వతంగా నది పాలయింది. క్రమేణా రాజు నిర్మించిన కోటకూడా కాలగర్భంలో కలిసిపోయింది. బాజ్ బహదూర్, మాల్వా పాలకుడయి నప్పుడు ఇక్కడ కొన్ని భవనాలు కనుగొనబడి జీర్ణోద్ధారణ చేయబడ్డాయి. ఆ ప్రాంతంలో వున్న రూపమతి అనే అమ్మాయిని బాజ్ బహదూర్ ప్రేమించాడు. వారిరువురూ సంగీత ప్రియులు, చక్కటి గాయనీగాయకులు.






బాజ్ బహదూర్ ఆమెను పెళ్ళాడాలనుకున్నాడు. అందుకు రూపమతి, "నన్ను నేను నర్మదానదీకుమారిగా భావిస్తున్నాను. ఆ నదిలో స్నానం చేయకుండా నేను ఒక్కరోజు కూడా గడపలేను," అన్నది. నర్మదానదిని కొండమీదికి తీసుకెళ్ళడం ఎలా? బాజ్ బహదూర్ నదీమతల్లిని మనసారా ప్రార్థించాడు.

ఒకనాడు రాత్రి బహదూర్ నిద్రిస్తున్నప్పుడు, "కొండమీది చింతచెట్టుకింద తవ్వు. నేను బుగ్గరూపంలో ప్రత్యక్షమవుతాను," అని నర్మదానది చెప్పినట్టు కలగన్నాడు. అతడు అలాగే చేశాడు. చింతచెట్టుకింద చల్లటి నీటి బుగ్గ పైకెగసింది. రివాకుండ్ అనే పేరుతో ఆ బావి ఈనాడు కూడా అక్కడ వున్నది.





మాల్వాదేశం మీదికి అక్బరు దండయాత్ర జరిపాడు. సంగీతం వంటి కళలతో తలమునకలుగా వున్న బాజ్ బహదూర్ అక్బరును ఎదుర్కోలేక పోయాడు. రూపమతి ఆత్మాహుతి చేసుకున్నది. అయితే, ఆమె వసించిన భవనం మాత్రం ఇప్పటికీ నిలచివున్నది.

కాలప్రవాహానికి తట్టుకుని నిలిచివున్న మరొక ముఖ్య భవనం—జహాజ్ మహల్. అందమైన ప్రకృతి ఒడిలో, ప్రశాంత గంభీరంగా వెలుగొందుతూన్న ఈ భవనం, గత వైభవాలకు మౌనంగా సాక్ష్యం పలుకుతున్నట్టున్నది.






బాజ్ బహదూర్ తన అంతిమదశను అక్బర్ ఆస్థానంలోనే గడిపాడు. అద్భుతమైన అతని సంగీత ప్రతిభ అతణ్ణి, అక్బర్ అభిమానానికి పాత్రునిగా చేసింది. అయినా బాజ్ బహదూర్, తను కోల్పోయిన మాండూనూ, ప్రేయసినీ తలుచుకోవడంవల్ల కాబోలు ఎప్పుడూ విచారంగానే వుండేవాడు!



# మాయనిచ్చెన

మలయగిరి రాజు మహీపాలుడు, ఒక నాడు సభతీరివుండగా, బారెడుగడ్డం వున్న ఒక గూనిముసలివాడు, ఒక నిచ్చెనను వీపునమోస్తూ సభలోకి వచ్చి, రాజుకు నమస్కరించి, ''నన్ను కాపాడండి, ప్రభూ!'' అన్నాడు.

''నీకొచ్చిన ఆపద ఏమిటో చెబితే, తప్పక కాపాడతాను,'' అన్నాడు మహీపాలుడు.

అందుకు గూనిముసలివాడు, ''ప్రభూ, నా జీవితకాలమంతా కష్టపడి, యీ మాయనిచ్చెనను సంపాదించుకున్నాను. ఈ రోజు, దీన్ని కాజేసి, దీని ద్వారా ధనార్జన చేయాలని గజదొంగ గవ్రరాజు వెంటాడుతున్నాడు,'' అని చెప్పాడు.

మహీపాలుడు, ఆ ముసలివాడికి కోటలోనే బస ఏర్పాటు చేసి, ఇద్దరు కాపలా భటుల్ని నియమించాడు.

ఈ సంగతి తెలుసుకున్న గజదొంగ గవ్రరాజు, కోట కాపలావాళ్ళ కళ్ళుగప్పి లోపల ప్రవేశించి, గూనిముసలివాడి నుంచి మాయనిచ్చెనను దొంగిలించలేక, అక్కడ దొరికిన విలువైన వస్తువులు ఎత్తుకుపోసాగాడు. కాపలాభటులు ఎంత ప్రయత్నించీ వాణ్ణి పట్టుకోలేకపోయారు.

ఇది పని కాదని రాజు మహీపాలుడే స్వయంగా గజదొంగను పట్టుకునేందుకు బయలుదేరాడు. వేగులు యిచ్చిన గజదొంగ ఆచూకీనిబట్టి, రాజు పోయిపోయి, ఒక కొండప్రదేశాన్ని చేరుకున్నాడు.

అయితే, రాజును అంతదూరంలోనే చూసిన గజదొంగ, పశువులకాపరిగా నటిస్తూ, రాజుకు ఎదురువెళ్ళి, ''మహారాజా, ఆ కనబడే గుహలో రత్నాలు రాశిగా పోసివున్నవి. పశువులు కాసుకునే నాకు, అంత ధనంతో పని లేదు. మహా

మల్లవరపు మనోహరరెడ్డి



రాజులైన మీకు ఉపయోగకారిగా వుంటుంది,'' అన్నాడు.

రాజు ఆశ్చర్యపోతూ గుర్రం దిగి, గుహలోకి వెళ్ళాడు. వెంటనే గజదొంగ బండరాయితో గుహద్వారాన్ని మూసి, గుర్రమెక్కి రాజుగారి కోటకు బయలుదేరాడు.

వాడు కోటను చేరి, రాజుగారి తమ్ముడైన అనంగపాలుణ్ణి కలుసుకుని, "ప్రభూ, రాజుగారు నాకు అడవిలో కనిపించారు. ఆయన ఐహిక సుఖాల మీద విరక్తి చెందారట. అందువల్ల, తాను సన్యసిస్తున్నాననీ, యీనాటి నుంచి రాజ్యభారం తమను మోయవలసిందిగా చెప్పమన్నారు. ఇందుకు సాక్ష్యంగా, నేనెక్కివచ్చిన మహారాజుగారి గుర్రాన్ని చూడండి!'' అన్నాడు.

మహీపాలుడి గుర్రాన్ని చూడగానే, అనంగపాలుడికి, గజదొంగ మాటల్లో నమ్మకం కలిగి, తాను రాజు కాబోతున్నాననే ఆనందంలో వాడికి తన మెడలోని హారాన్ని బహూకరించాడు.

గజదొంగ హారాన్ని అటూ యిటూ తిప్పిచూసి, ''ప్రభూ, యింత మంచి వార్త మోసుకొచ్చినందుకు, యీ హారం బహూకరించారు, బాగానే వున్నది. కాని, ఆ మాయనిచ్చెన కూడా యిస్తే, చాలా సంతోషిస్తాను,'' అన్నాడు వినయంగా.

వాడు మాయనిచ్చెన కావాలనేసరికి, అనంగపాలుడికి అనుమానం కలిగి, వాణ్ణి పట్టుకునేందుకు భటులను పిలిచాడు. అయితే, గజదొంగ వెంటనే అక్కడి నుంచి పారిపోయాడు.

వాడు ఆగ్రహావేశంతో, గుహదగ్గిరకు పోయి, దానికి అడ్డంగా వేసిన బండరాయిని తొలగించి, రాజు మహీపాలుడితో, ''మీ అన్నదమ్ములు రామలక్ష్మణుల్లాంటివారని, ఊరూ వాడా చెప్పుకుంటూంటే— పరీక్షిద్దామని, యీ పని చేశాను. మీ తమ్ముడు లక్ష్మణుడు కాదు; రావణుడు. మీరు సన్యాసుల్లో కలిసిపోయినట్టు చెప్పగానే, సంతోషం పట్టలేక, నాకీ హారం

బహూకరించాడు," అని, అనంగపాలు డిచ్చిన హారం చూపించాడు.

రాజుకు పట్టలేనంత కోపం వచ్చింది. ఆయన వెంటనే బయలుదేరి కోటకు వచ్చాడు. ఆయన అంతఃపురం కేసి పోబోతూండగా, గూనిముసలివాడు ఆయనను చూసి, చాలా కోపంగా వున్నాడని గ్రహించి, ఎదురువచ్చి, "ప్రభూ, మీరు నా బసకు వచ్చారంటే, ఒక గొప్పవింత చూడగలరు," అన్నాడు.

ఆ వింత ఏమిటో తెలుసుకోదలచి, మహీపాలుడు గూనిముసలివాడి బసకు వెళ్ళి, వాడు కోరగా మాయనిచ్చెన ఎక్కి అటకమీదికి చేరాడు.

అక్కడ రాజుకు ఒక చిత్రమైన దృశ్యం కనిపించింది. రాజు తండ్రి మరణశయ్య మీద వున్నాడు. ఆయన మహీపాలుణ్ణి దగ్గిరకు పిలిచి, పక్కనే వున్న పదేళ్ళ అనంగపాలుణ్ణి చూపుతూ, "నాయనా, యీ నీ తమ్ముడికి ఎలాంటి లోటూ కలగకుండా చూడు. పసితనం వల్ల ఏదైనా పొరబాటు చేస్తే, క్షమించి ఆదరించు!" అని కోరాడు.

మహీపాలుడు, అనంగపాలుణ్ణిదగ్గిరకు తీసుకుని, "నాన్నగారూ, నిశ్చింతగా వుండండి! తమ్ముణ్ణి ప్రాణప్రదంగా చూసుకుంటాను," అని మాటయిచ్చాడు.



మహీపాలుడు నిచ్చెన దిగి వచ్చి, గూని ముసలివాడికి కృతజ్ఞతలు చెప్పి, "ఈ రోజు నీవల్ల, నా తమ్ముడు రక్షింపబడి, నా తండ్రికి చేసిన వాగ్దానం నిలుపుకున్నాను. నీకేం కావాలో కోరుకో!" అన్నాడు.

"ప్రభూ, గజదొంగ గవరాజు నుంచి, యీ నిచ్చెన కాపాడబడడం తప్ప, మరే కోరికా నాకు లేదు. ఈ మాయనిచ్చెన మహిమతో, ఎవరికీ శత్రుభయం లేకుండా చేసి, మంచి పేరు తెచ్చుకోవాలన్నదే, నా ఆశ," అన్నాడు గూనిముసలివాడు.

రాజు కొంచెంసేపాలోచించి, "అసలు, ఈ నిచ్చెన మహిమ శత్రువులు లేకుండా

చేయడమేకదా ? అలాంటప్పుడు, నువ్వు శత్రువు గురించి ఆలోచించడం అర్థం లేనిపని. నువ్వు వెంటనే కోటను వదిలి వెళ్ళు. నీ సమస్యకు పరిష్కారం దొరుకుతుంది,'' అన్నాడు.

రాజు, వాడెంత బతిమాలినా ఒప్పుకోక, కోట నుంచి బయిటికి పంపేశాడు.

గూనిముసలివాడు రాజును తిట్టుకుంటూ, నిచ్చెనను వీపున మోస్తూ బయలుదేరాడు. వాడలా కొంతదూరం వెళ్ళేసరికి, గజదొంగ ఎదురుపడి, మాయ నిచ్చెనను బలవంతంగా గుంజుకుని, అడవిలోకి పారిపోయాడు. గూనిముసలివాడు, దొంగ వెళ్ళిన దారినే బయలుదేరాడు.

అడవిచేరాక గజదొంగ, మాయనిచ్చెన మహిమ తెలుసుకునేందుకు, దాన్ని ఒక గుబురుచెట్టుకు ఆనించి, పైకిపోయాడు. అక్కడ యిద్దరు రాజభటులు, గజదొంగ చేయిపట్టుకుని, ''ఒరే, నువ్వు చేసిన నేరాలకు, నిన్ను ఉరితీయమని, రాజాజ్ఞ!'' అని, గవర్రాజు కంఠానికి తాడును బిగించి, చెట్టుకు వెళ్ళాడదీసి వెళ్ళిపోయారు.

కంఠానికి క్రమంగా ఉరి బిగుసుకుంటున్నకొద్దీ, గజదొంగ భయకంపితుడై పోసాగాడు. సరిగా ఆ సమయంలో, గూని ముసలివాడు అక్కడకు వచ్చి, గజదొంగ గవర్రాజును ఉరితాడు నుంచి తప్పించి, నేల మీద పడుకోబెట్టాడు.

కొద్దిసేపటికి గజదొంగ తెప్పరిల్లి, గూని ముసలివాడి కోసం చుట్టూ చూసేసరికి, దూరంగా తనకేసే వస్తూ కనిపించాడు.

గజదొంగ పరుగున వెళ్ళి, ముసలివాడి కాళ్ళ మీద పడి, ''నన్ను క్షమించు, తాతా! సమయానికి వచ్చి, నా ప్రాణం కాపాడినందుకు, ఈ జన్మలో నీ రుణం తీర్చుకోలేను,'' అని అడవిలోకి వెళ్ళిపోయాడు.

మాయనిచ్చెన మహిమవల్ల, గజదొంగ గవర్రాజులో వచ్చిన మంచి మార్పుకు, గూనిముసలివాడు సంతోషించి, రాజు దూరదృష్టికి మెచ్చుకోలుగా దాన్ని ఆయనకు బహూకరించాడు.






# కృష్ణావతారం

కాళిందీతీరాన ఒక గొప్ప గొల్లపల్లె ఉన్నది. ఆవులతోనూ, దూడలతోనూ, ఎద్దులతోనూ, రకరకాల పనులలో మునిగి ఉన్న గోప స్త్రీలతోనూ, పురుషులతోనూ అక్కడ ఎప్పుడు చూసినా చాలా సందడిగా ఉన్నది. వసుదేవుడి ప్రేరణతో నందుడు సకుటుంబంగా ఆ వ్రేపల్లెకు వచ్చి చేరాడు. అక్కడి వృద్ధులలో కొందరు ముఖ్యులు అతనికి ఎదురు వెళ్ళి, అభినందించారు. నందుడు కూడా వారితో కుశలప్రశ్నలు జరిపి, చిరునవ్వుతో అందరినీ పేరుపేరా పలకరించి, వారి వెంట వ్రేపల్లె చేరుకున్నాడు. వృద్ధ గోపికలు నందుడి ఇంటికి వచ్చి యశోదకూ, ఆమె కన్న బిడ్డకూ పరమానందంతో పురిటివేడుకలన్నీ జరిపారు. రోహిణి వచ్చింది, నందుడామెకు తగిన మర్యాదలు చేశాడు.

గోపికలకు ఎంతో ముద్దుగా కృష్ణుడు గోపకులంలో పెరుగుతున్నాడు. కొన్ని రోజులు గడిచాయి.

గర్భస్రావాలూ, శిశుహత్యలూ చెయ్యటానికై కంసుడు అనేకమంది రాక్షసులను నియోగించాడు. వారిలోకెల్లా గొప్పది, పూతన అనేది మహా భయంకరమైన ఆకారం గలది. ఆమె రాత్రివేళ పసిపిల్లలను వెతుక్కుంటూ వస్తూ, నందగోపుడి బండి కింద, తల్లి పక్కన పడుకుని వున్న కృష్ణుణ్ణి చూసి ఆగింది. పిల్లవాడు మంచి తేజస్సు కలిగి, అద్భుతంగా కనబడుతున్నాడు. అందరు పిల్లల్లాగా లేడు. ఒక

## 3. బాలకృష్ణ లీలలు



వేళ కంసుణ్ణి చంపటానికి పుట్టినవాడు వీడేనేమో!

ఇలా అనుకోగానే పూతనకు కోపావేశం వచ్చేసింది. ఆ రాక్షసి పళ్ళు పటపటా కొరికింది. దాని మిడిగుడ్ల నుంచి కణకణలాడే నిప్పులు రాలాయి. కనుబొమలు ముడుచుకున్నాయి. నుదుట చెమట పట్టింది. ఊపిరి తీవ్రంగా ఆడింది. ఆమె ఆ పిల్లవాణ్ణి తల్లి పక్క నుంచి బలాత్కారంగా లాక్కుని, విషం పూసి ఉన్న తన చనుమొనలు వాడి నోట కుక్కింది. కృష్ణుడు కెవ్వున ఏడుస్తూ పూతన చనుమొనలు నోట గట్టిగా పట్టుకుని, బలంకొద్దీ పాలతోపాటు పూతన శరీరంలోని సప్తధాతువులనూ పీల్చివేశాడు. నిజానికతను పూతనను మించిన రాక్షసుడు. అందుచేత పూతన అతి వికారమైన ఆర్తనాదం చేసి, అక్కడే విరుచుకు పడిపోయింది.

ఆ భయంకరమైన కేకకు మందలో గల గోపకులంతా తుళ్ళిపడి నిద్రలేచారు. కృష్ణుడు ఏడ్చినప్పుడే యశోద నిద్ర లేచింది. ఆమె మేలుకుంటూనే పక్కలో పిల్లవాడు కనపడక పోయేసరికి భయపడి, నందుణ్ణి కేకపెట్టింది. నందుడు వచ్చేసరికి మిగిలిన గోపులు కూడా రానే వచ్చారు. వారికి భయంకరమైన పూతన కళేబరం కనిపించింది, దాని ఒడిలో పిట్టలాగా వాలి ఉన్న కృష్ణుడు కూడా కనిపించాడు.

యశోదానందులు తమ కొడుకును చూస్తూనే, "అయ్యో నా తండ్రీ!" అంటూ చప్పున వచ్చి ఆప్యాయంగా బిడ్డను ఎత్తుకున్నారు.

"ఏమిటిది? దుర్మార్గురాలయిన ఈ రాక్షసి ఇక్కడికెలా వచ్చింది? అది వచ్చి బిడ్డనిలా చేస్తుంటే నువ్వెలా చూస్తూ ఊరుకున్నావు?" అని నందుడు కోపంగా తన భార్య నడిగాడు.

"బిడ్డకు కడుపునిండా పాలిచ్చి నిద్రపుచ్చాను. దివిటీ వెలుగుతున్నది. చాలా

సేపు మేలుకునే ఉండి, ఒక్క క్షణం పాటు కన్నుమూశాను. అది కూడా ఎంతో సేపు కాలేదు. ఈ రాక్షసిముండ ఎలా వచ్చిందో, పిల్లవాణ్ణి ఏం చెయ్యబోయిందో, ఇదేం మాయో నాకేమీ తెలీదు. అయినా ఈ రాక్షసి ముండకు చిక్కి కూడా నా బిడ్డ ఏ కీడూ లేకుండా తిరిగి నాకు దొరికాడు. వీడికి వెయ్యేళ్ళాయుస్సు.'' అన్నది యశోద.

కృష్ణుడికి గొప్ప గండం తప్పిందని గోపకులంతా ఎంతో సంతోషించి, పూతన కళేబరాన్ని దూరంగా లాగేశారు. నందుడు తన కొడుకు నెత్తుకుని, వాడికి దిష్టితీసి, ఏవో మంత్రాలు చదివి, మనసారా ఆశీర్వదించాడు.

రోజులు గడుస్తున్నాయి. కృష్ణుడు క్రమంగా పెరుగుతున్నాడు.

ఒకనాడు వసుదేవుడు తన పురోహితుడైన గర్గుడనే బ్రాహ్మణుణ్ణి అతి రహస్యంగా గోకులానికి పంపాడు. ఆయన ఒక శుభముహూర్తాన వచ్చి రోహిణి కొడుకుకూ, యశోద కొడుకుకూ జాత కర్మలు జరిపి, ఆ పిల్లలిద్దరికీ రాముడూ, కృష్ణుడూ అని పేరు పెట్టి, అక్కడికి ఎంత రహస్యంగా వచ్చాడో అంత రహస్యంగా తిరిగి వెళ్ళిపోయాడు.

నందుడి ఆనందానికి మితిలేదు. అతను బ్రాహ్మణులనుపిలిపించి, షడ్రసోపేతంగా భోజనాలు పెట్టి, గోవులూ, వస్త్రాలూ దానం చేశాడు. పెద్ద ఉత్సవం జరిగింది.





గోకులంలో గల బంధువులందరికీ నందుడు బట్టలు పెట్టాడు. గోపూజ చేశాడు. గోవాటం అలంకరింప చేశాడు. గోపకాంతలు యశోదను, పండంటి కొడుకును కన్నందుకు అభినందించారు. అలాగే గోపకులు కూడా నందుణ్ణి అభినందించారు.

అక్కడ మధురాపురంలో కంసుడికి పూతనకు పట్టిన గతి తెలియ వచ్చింది. అతని భృత్యులయిన రాక్షసులు జరిగినదంతా అతనికి తెలిపారు. నందగోపుడి కొడుకు పైన కంసుడి అనుమానం కేంద్రీకృతమయింది. అతనికి అప్పుడు కొంత కంపరం కూడా కలిగింది. అందుచేత అతను తన భృత్యులైన రాక్షసులను అనేకమందిని గట్టిగా హెచ్చరించాడు. ఆ రాక్షసులలో శకటు డనేవాడు వెళ్ళి నందుడి సొంత బండిలో అదృశ్యరూపంలో ప్రవేశించి అవకాశం కోసం జాగ్రత్తగా నిరీక్షించసాగాడు.

యశోద కృష్ణుణ్ణి నిద్రపుచ్చి, ఆ బండి కిందనే పక్క పరిచి పడుకోబెట్టి, మిగిలిన గోపస్త్రీలతో సహా నదిలో స్నానం చేసి రావటానికి బయలుదేరి వెళ్ళింది. ఆమె వెళ్ళిన కొద్దిసేపటికి బిడ్డ మేలుకున్నాడు. దగ్గిర ఎవరూ లేకపోయేసరికి, రెండు చేతులూ నోట్లో కుక్కుకుంటూ ఏడ్చి, ముఖమంతా కళ్ళకాటుకతో కూడిన తడి చేసుకున్నాడు. కాళ్ళు తన్నుతూ కొంత సేపు ఎగిరెగిరి పడ్డాడు. అలా కాళ్ళు తన్నుకుంటూనే బండిని ఒక కాలితో తన్నేసరికి, బండి పక్కకు పడి ఛిన్నాభిన్నమయింది.

ఇంతలో యశోద స్నానం చేసి వచ్చి, పిల్లవాణ్ణి గురించి తొందరపడుతూ, గబగబా వచ్చింది. బోల్తాకొట్టి బద్దలైపోయిన బండి ఆమెకు కనిపించింది. ఆమె వెంటనే కెవ్వున అరిచి, పిల్లవాణ్ణి ఎత్తుకుని రొమ్మున అదుముకుంటూ, "అమ్మయ్యో, బిడ్డ నిద్రపోతున్నాడుగదా అని స్నానానికి వెళ్ళాను గాని, ఇప్పుడు మీ నాన్న వచ్చి,



ఇది చూసి, ఎన్నిమాటలంటాడో ఏమో, ఈ బండి ఇలా ఎందుకయిందో ఎవరు చెబుతారు? భర్త అడిగితే నేనేం చెప్పాలి?'' అనుకుంటూ, ఆమె కృష్ణుణ్ణి తొడ మీద కూర్చోబెట్టుకుని పాలివ్వ సాగింది.

ఇంతలో నందగోపుడు ఒళ్ళంతా దుమ్ము కొట్టుకుని, జుట్టంతా చెదరి, చేత కఱుపుల కఱ్ఱ పట్టుకుని, గోపులతో రకరకాల కబుర్లు చెబుతూ అక్కడికి వచ్చాడు. వస్తూనే ఊడిపోయిన చక్రాన్నీ, విరిగిపోయిన ఇరుసునూ చూసి ఒక్క సారిగా వణికిపోయాడు. ఎందుకంటే, తన కొడుకు ఎప్పుడూ ఆ బండి కిందనే గదా పడుకుంటాడు? బండి ఇంత ఛిన్నా భిన్నమై విరిగిపోయింది గదా, మరి బిడ్డ ఏమైనట్టు?

మరుక్షణమే అతను తన భార్యనూ, ఆమె దగ్గిర పాలుతాగుతూ, ముఖాన సంతోషమూ, చూపులు తల్లి ముఖానా గల కృష్ణుణ్ణి చూశాడు. నందుడి ప్రాణం కుదటపడింది. అతను గుండె నిమురు కుంటూ, ''బండి ఇలా ఛిన్నా భిన్నం అయిపోయిందేం?'' అని భార్యను అడిగాడు. ఏవైనా ఎద్దులు బండిని పడదోసి తొక్కాయో, లేక పెద్ద గాలి వీచిందో అని నందుడికి అనుమానం కలిగింది. ''ఏమైతే నేం లే? బిడ్డడు క్షేమంగా ఉన్నాడు. అంతే చాలు,'' అన్నాడు మళ్ళీ నందుడు సంతోషంగా.

యశోద గద్గదకంఠంతో, ''అసలు తప్పంతా నాదే లే. బిడ్డ నిద్రపోతుంటే, ఈ బండి కింద పక్క మీద పడుకోబెట్టి, దగ్గిరేగదా అని ఏటికి వెళ్ళి, స్నానం చేసి తిరిగి వచ్చి చూతునుగదా ఇలా అయింది. అదృష్టం బాగుండి అబ్బాయి కీ గండం గడిచింది.'' అన్నది.

ఇంతలో కొంతమంది కుర్రవాళ్ళు అక్కడికి వచ్చి, ''ఏమమ్మోయి, మే మిక్కడ ఆడుకుంటుంటే, మీ కృష్ణుడు కాలు చాచి ఒక్క తోపు తోసేసరికి, ఈ

బండి ఇలా విరిగి పక్కకు పడింది. ఎంత చిత్రమో చూసుకోండి,'' అన్నారు అమితాశ్చర్యంతో.

యశోదానందుల ఆశ్చర్యానికీ ఆనందానికీ మేరలేదు. వాళ్ళు తమ కొడుకును ముద్దాడి, ఇంత మట్టి తీసి పిల్లవాడికి దిగుదుడిచి పారేశారు. తన కొడుకును కాపాడుతూ ఉండమని నందుడు దేవతలకు దణ్ణం పెట్టుకున్నాడు. ఈ లోపల పదిమందీ చేరి, జరిగిన సంగతి విని, చూసి, నిశ్చేష్టులైపోయారు. తరవాత, అందరూ పూనుకుని విరిగిపోయిన బండిని తిరిగి కూర్చి, ఎప్పటి లాగా చేసేశారు.



రోజులు గడుస్తున్నాయి. కృష్ణుడు పెరుగుతున్నాడు. బోరగిలపడి, మంచం అంచులకు దేకుతున్నాడు. కితకితలు పెడితే కిలకిలా నవ్వి కేరింతలు కొడుతున్నాడు. నిలబెట్టి వేళ్ళు పట్టుకోవటానికిస్తే తప్పటడుగులు వేస్తున్నాడు. చప్పట్లు కొట్టి, "దా, దా," అని పిలిస్తే దగ్గిరికి వస్తున్నాడు. చూసినవాళ్ళు అతన్ని ఎత్తుకుని ముద్దాశకుండా ఉండలేరు. అందుకని మువ్వలు గలగల్లాడిస్తూ, దొంగ మాపులు చూస్తూ ఎటో పారిపోతాడు. చూసేవాళ్ళు పరమానందం చెందుతారు.

తల్లి కృష్ణుడికి వెన్న గోరుముద్దలుగా చేసి రోజూ తినిపించేది. చేతి జిడ్డూ, మూతి జిడ్డూ, ఒళ్ళంతా పట్టించేది. ఉదయం పూట తల్లి కడుపునిండా వెన్న పెట్టి గృహకృత్యాలు చూసుకోవటానికి పోతే, తప్పటడుగులు వేసుకుంటూ వెనకనే వెళ్ళేవాడు. ఆడవాళ్ళ దగ్గిరికిపోయి వెన్న పెట్టమని బతిమాలేవాడు. ఎంత పెట్టినా ఇంకా పెట్టమని వేధించుకు తినేవాడు. వెన్న చిలికేవాళ్ళ దగ్గిరికి వెళ్ళి, కవ్వం తాడు పట్టుకుని కవ్వం ఆడకుండా చేసేవాడు. జుట్టుముడి ఊడదీసేవాడు, చీరె కొంగు పట్టుకుని లాగేవాడు.

"వెన్న పెడతాను గాని కాస్త ఆట చూపించరా, బాబూ," అని గోపికలు అడిగితే మువ్వలూ, మొలగంటలూ

గలగలలాడుతూ ఆడేవాడు. గోపికలు చల్ల చెయ్యటం మానేసి చూసి ఆనందించే వాళ్ళు. అస్తమానమూ గోకులంలో ఉండే ఇళ్ళన్నీ తిరిగేవాడు. వాడితో వేగలేక గోపికలు నలుగురూ నాలుగు పక్కల నుంచి, "పట్టుకోండి, పట్టుకోండి," అంటూ ఒకరినొకరు హెచ్చరించుకుంటూ వచ్చి, పట్టుకుని యశోదకు అప్పజెప్పే వాళ్ళు.

కాలం గడుస్తున్నకొద్దీ కృష్ణుడి ఆటలు మారి పోతున్నాయి. గోపబాలకు లందరూ బలరామకృష్ణుల చుట్టూ చేరే వాళ్ళు. అందరూ కలిసి ఒక దండులాగా వ్రేపల్లె అంతా చెడ తిరిగే వాళ్ళు. కృష్ణుడు కుండల్లోనూ, చట్లలోనూ ఉండే పాలూ, నెయ్యీ తాగేవాడు. తాగినంత తాగి, మిగిలినది నేల మీద పోసి, కాళ్ళతో మట్టగించేవాడు. అలాటి చిలిపి చేష్టలు చెయ్యకుండా ఆపటం ఎవరివల్లా అయేది కాదు. పాలసముద్రం మథించగా వచ్చిన అమృతాన్ని మోహిని దేవతలకు పంచి నట్టుగా, కృష్ణుడు గోపికల ఇళ్ళలోని పాలూ, మీగడా తాను తినటమేగాక తన వెంట ఉన్న కుర్రకారు కంతకూ పంచి పెట్టేవాడు. ఉట్లు తెంచేవాడు, బానలు దొర్లించేవాడు, కడవల్లో పాలు సగం తాగి వాటిని చల్లతో మళ్ళీ నింపేవాడు. నెయ్యి తీసుకుపోయి నిప్పులో పోసి భగ్గున మంటలు లేపేవాడు. పెరుగులో పాలూ, వెన్నలో పెరుగూ, చల్లలో నెయ్యీ కలిపేసేవాడు. దూడలను విప్పి ఆవుల పాలు తాగెయ్యనిచ్చేవాడు. కొన్నిటిని కట్లు విప్పి వదిలేసేవాడు. కావళ్ళతాళ్ళు తెంచేసేవాడు. పిల్లలందరినీ చేర్చి ఆట లాడేవాడు. ప్రతి ఆటలోనూ అందరినీ ఓడించి, వీపు పగిలేటట్టు కొట్టేవాడు. ఒక్కొక్కడి వీపునా ఎక్కి మోయించు కునేవాడు. ఆటల్లో ఎంత మొనగాణ్ణయినా ఏడిపించుకు తినేవాడు.

ఈ విధంగా కృష్ణుడు గోకులాన్నంతా ఒక కొలిక్కి తెస్తుంటే గోపకులు ఏం చెయ్యాలో తోచక నిశ్చేష్టులైపోయారు.





# మనోవ్యాధే మందు

అనగనగా ఒక రాజు. ఆ రాజు అష్ట యిశ్వర్యాలతో తులతూగుతూ, చీకూ చింతా లేకుండా చాలా కాలం జీవించాడు. రాజ్యానికి శత్రుభయంలేదు. రాచకార్యాలు చూడటానికి సమర్థులైన మంత్రులున్నారు. ఇంక రాజుగారికి ఉన్న పనల్లా ఏమిటంటే సుష్టుగా భోంచెయ్యటమూ, కడుపులో చల్ల కదలకుండా కూచుని రకరకాల వినోదాలు అనుభవించటమూనూ.

ఇలా ఏళ్ళతరబడి తిని కూచుంటే ఎవడికైనా ఒళ్ళు కొవ్వెక్కి పోతుంది. రాజుగారికీ అంతే అయింది. పొట్ట బాన లాగా పెరిగింది. ఒళ్ళు లావై బరువెక్కి పోయింది. కూర్చున్నవాడు లేవటం కూడా కష్టమయింది. నడవటానికి అసలే శక్తి లేదు.

తన స్థితి తలుచుకుంటే రాజుగారికే భయం పుట్టుకొచ్చింది. శరీరం ఐరావతం లాగా పెరిగిపోయిందాయె, అడుగు తీసి అడుగు పెట్టలేడాయె! సన్నగా ఉన్న వాళ్ళనీ, గబగబా నడిచే వాళ్ళనీ, చువ్వల్లాగా వంగి లేచే వాళ్ళనీ, సునాయాసంగా పరిగెత్తే వాళ్ళనీ చూసి ఆ రాజు, "అయ్యో, నేనలా లేకపోతినే! ఈ ఒళ్ళు కరిగితే ఎంత బాగుణ్ణు!" అనుకునేవాడు.

ఏళ్ళతరబడి పెంచిన ఒళ్ళు వద్దనుకుంటే పోతుందా? దాని కేదో ఒకటి చెయ్యాలి గద! తన ఒళ్ళు తగ్గించే ఉపాయం చూడమని మంత్రులను ఆజ్ఞాపించాడు. మంత్రులు మాత్రం ఏం చెయ్యగలరూ? వైద్యులను పిలిపించి సలహా అడిగారు. వైద్యులేవో మందు లిచ్చారు. రాజుగారు మందైతే తింటాడు గాని, పథ్యాలు చెయ్యడు. పథ్యాలు సరిగా ఉండకపోతే మందులు పని చెయ్యవు.



రాజుగారి శరీరం తేలిక చెయ్యటం తమకు సాధ్యం కాదని వైద్యులు చేతులు కడిగేసుకున్నారు.

ప్రయత్నాలు వ్యర్థమవుతున్నకొద్దీ రాజుగారికి చిక్కాలన్న ఆదుర్దా జాస్తి అయింది. తనని సన్నగా చువ్వలాగా చేసిన వాడికి అర్ధరాజ్యమైనా ఇచ్చేస్తానని ఆయన మంత్రులతో అన్నాడు. మంత్రులు అదే విధంగా చాటింపు వేశారు. అర్ధరాజ్యం కోసం ఆశపడి అడ్డమైన వాళ్ళూ వచ్చి రాజుగారిని హైరానపెడతారేమోనని మంత్రు లేంచేశారంటే, రాజుగారి శరీరం తగ్గించిన వాళ్ళకి అర్ధరాజ్య మిస్తామనీ, చికిత్స ప్రారంభించి విఫలులైనవాళ్ళని ఉరి తీసేస్తామనీ చాటింపు వేశారు. అంటే ఏమిటన్నమాటా? వస్తే అర్ధరాజ్యం, పోతే ప్రాణం! అర్ధరాజ్యం రాకపోతే మానె, చావటానికి ఎవడు సిద్ధపడతాడూ? అంచేత చాటింపు విని ఎవడూ, "మేము రాజుగారికి చికిత్స చేస్తాం!" అని చెప్పి ముందుకు రానేలేదు.

ఈ చాటింపు కూడా పారలేదని రాజు విచారిస్తూండగా యోగానందుడనే గోసాయి వచ్చి, ఆయన శరీరం తగ్గిస్తానన్నాడు.

"అందుకుగాను ఏ ఔషధాలు ఉపయోగించేదీ మాకు చెప్పాలి. మా ఎదటే వాటిని తయారు చెయ్యాలి," అన్నారు మంత్రులు గోసాయితో.

"మామూలు మందులన్నీ మీరు వాడే ఉంటారు. అయినా నేను రోగి యొక్క జాతకం చూడనిదే మందివ్వను. అందుకే నా వైద్యానికి తిరుగులేదు. రాజుగారి జాతకచక్రం ఇప్పించండి," అన్నాడు గోసాయి.

మంత్రులు రాజుగారి జాతకం గోసాయికిచ్చారు. గోసాయి దాన్ని చాలాసేపు పరిశీలించి, చప్పరించి, "రాజుగారికి మందులతో పని లేదు. ఇంకా ముప్పై రోజులకు ఆయన ఆయుర్దాయం ఎలానూ తీరిపోతున్నది." అన్నాడు.

"రాజుగారి జాతకం చూసి ఎవరూ ఈ మాట అనలేదు. నీవు చెప్పేది వట్టి అబద్ధం," అన్నారు మంత్రులు.

"నేను చెప్పేది అక్షరాలా జరిగి తీరుతుంది. నా మాట నమ్మకం లేకపోతే ఈ ముప్పై రోజులూ నన్ను నిర్బంధంలో ఉంచండి," అన్నాడు గోసాయి.

మంత్రులు గోసాయిని ఖైదులో ఉంచి అతడి అన్నపానాదులకు తగిన ఏర్పాట్లు చేశారు. రాజుగారికి మాత్రం గోసాయి చెప్పిన జోస్యంలో గురి కుదిరింది. తన జోస్యంలో ఎంత నమ్మకం లేకపోతే ఆ గోసాయి తనకు తానై ఖైదులో ఉంటాడు! ఇంక ముప్పై రోజులకు చచ్చిపోతానన్న భయం రాజుగారిని బాగా పట్టుకుని మనోవ్యాధి కింద పరిణమించింది. ఒక్కొక్క క్షణమే గడుస్తుంటే తన ప్రాణం కొంచెం కొంచెమే పోతున్నట్టు అనిపించేది. ఆయనకు వినోదాలు చూడాలన్న ఆసక్తి పూర్తిగా పోవటం అటుంచి, అన్నహితవు తప్పింది, కంటికి కునుకన్నది రాకుండా పోయింది.

ఆరోజు కారోజు రాజుగారి మనోవ్యాధి పెరగసాగింది. గోసాయి మాటలు నిజం కావని మంత్రులు ఎంత ధైర్యం చెప్పినా రాజుగారి మనోవ్యాధి తగ్గలేదు. గోసాయి చెప్పిన గడువు పూర్తి అయే రోజుల్లో ఆయన పూర్తిగా మంచం పట్టాడు; బంధువులతో, మంత్రులతో మాట్లాడటం కూడా మానేశాడు.



ముప్పై రోజులూ ఎలాగో గడిచాయి. రాజుగారు చిక్కి శల్యమయ్యాడే తప్ప చావలేదు.

ముప్పై ఒకటో రోజున ఆయన మనో వ్యాధి తీసేసినట్టుగా పోయింది. ఆయన మంచం మీది నుంచి లేచి గబగబా మంత్రులుండే చోటికి వెళ్లి, "ఆ దుర్మార్గుడెక్కడ? అబద్ధం చెప్పినందుకు ఆ గోసాయివాణ్ణి ఇప్పుడే కొరత వెయ్యండి," అన్నాడు.

మంత్రులు ఖైదు నుంచి గోసాయిని విడిపించి తెప్పించారు. రాజుగారు బోనులో పులి లాగా అటూ ఇటూ పచారు చేస్తూ గోసాయిని చూడగానే మండిపడి అతడి పైకి వెళ్ళి, "దుర్మార్గుడా! తప్పుడు జోస్యం చెప్పి నన్ను హింసిస్తావా? నీకేమి శిక్ష విధించాలి?" అని అడిగాడు పట్టరాని ఆగ్రహంతో.

గోసాయి చిరునవ్వు నవ్వి, "శిక్షా? నాకింకా బహుమానం ఇస్తారనుకుంటున్నానే!" అన్నాడు.

"నాకు ఆయుర్దాయం లేదని అబద్ధాలు చెప్పినందుకు నీకు బహుమానమా?" అన్నాడు రాజు నిర్ఘాంతపోయి.

"రాజా, నేను మీకు చికిత్స చెయ్య వచ్చానుగాని జోస్యం చెప్పటానికి రాలేదు. మీ కొవ్వంతా కరిగిపోయింది. మీ శరీరం చువ్వలాగా అయింది. మీరు తేలికగా నడవగలుగుతున్నారు. కావలిస్తే పరిగెత్తగలరు కూడానూ. ఇంతా అయాక నేను చేసినది చికిత్స కాదంటారా?" అన్నాడు గోసాయి.

రాజుగారు ఆశ్చర్యపడ్డాడు. వెంటనే ఆయన నిలువుటద్దం దగ్గిరికి వెళ్ళి తన శరీరం పరిశీలనగా చూసుకుని పరమానందం చెందాడు. పొట్టంతా మాయమయింది. కొవ్వంతా కరిగిపోయింది. ఇప్పుడు తాను అందరిలాగే మామూలుగా ఉన్నాడు. మనోవ్యాధి మందు లాగా పని చేసింది. "గోసాయికి అర్ధ రాజ్యం ఇచ్చేసెయ్యండి," అన్నాడు రాజు తన మంత్రులతో.






# మిత్రమా!

టర్కీ దేశంలో కడుపేదవాడొకడు ఉండేవాడు. వాడు ఎంత కటిక దరిద్రుడంటే వాడికి జనం మొహం చూడటానికి కూడా ధైర్యం ఉండేది కాదు. కాని వాడి మనసులో మాత్రం ధనికుల కోరికలన్నీ ఉండేవి. వాటిని గురించి వాడు కలలు కనేవాడు.

ఒకనాడు వాడు ఒక కాఫీ దుకాణంలో ఒక మూల కూర్చుని ఉండగా, స్నానశాలకు పోతే ఎంత సుఖంగా ఉంటుందనిపించింది.

వాడు తిన్నగా స్నానశాలకు వెళ్ళి, తన బట్టలు విప్పేశాడు. స్నానశాలలో తనతో బాటు మరొక వ్యక్తి కూడా ఉన్నట్టు వాడికి తోచింది. స్నానశాల మనుషులు క్షణక్షణమూ ఆ మనిషికి షర్బతులూ, ఇతర పానీయాలూ తెచ్చి ఇస్తూ, సేవలు చేస్తున్నారు.

పేదవాడు లోపలికి తొంగిచూసి, ఆ మనిషి ముమ్మూర్తులా తనలాగే ఉండటం గమనించాడు. ఆ మనిషి స్థానం తాను ఆక్రమించాలన్న ఆలోచన వచ్చి, నౌకర్లు ఎవరూలేని సమయంలో పేదవాడు లోపలికి వెళ్ళి, ఆ మనిషి కట్టుకున్న తువాలు లాగేసి, ఆ మనిషిని నీళ్ళతొట్టిలో పడేసి, ఆ తువాలు తాను చుట్టుకుని, ఆ మనిషి స్థానంలో కూర్చున్నాడు.

ఇంతలో తిరిగి వచ్చిన స్నానశాల మనుషులు పేదవాడికి సమస్త మర్యాదలతో స్నానం చేయించి, మేలు రకం అంగీ కప్పి, వెలుపలి గదికి తెచ్చారు. అక్కడ ధనికుడి మనుషులు రకరకాల దుస్తులతో సిద్ధంగా ఉన్నారు. వాళ్ళు చప్పున ముందుకు వచ్చి, పేదవాడికి బట్టలు తొడిగి, బరువైన దీనారాల సంచీ చేతికి ఇచ్చారు.

పేదవాడు దుస్తులు ధరించటం పూర్తి చేసి, సంచీ నుంచి మూడు దీనారాలు తీసి, స్నానశాల మనుషులకు ముగ్గురికీ తలా ఒకటీ ఇచ్చాడు. స్నానశాలవాళ్ళు సగౌరవంగా అతని వెంట బయటికి వచ్చారు.

బయట పేదవాడి కోసం గుర్రం ఒకటి సిద్ధంగా ఉన్నది. నౌకర్లు వాణ్ణి గుర్రం ఎక్కమన్నారు. పేదవాడికి కంపరం పుట్టింది. కాని గుర్రం మీద ఎక్కనంటే నిజం బయటపడి పోతుందని, వాడు దాని మీద ఎక్కి, దాని యిష్టప్రకారం పోనిచ్చాడు.

గుర్రం వెళ్ళి ఒక దివ్యమైన ఇంటి ముందు ఆగింది. నౌకర్లు పరిగెత్తుకుంటూ వచ్చి తలుపులు తెరిచారు. వాళ్ళ సహాయంతో వాడు గుర్రం దిగి, లోపలికి వెళ్ళి, దిగ్భ్రమతో లోపల అంతా కలయజూశాడు.

"తమరు తమ గదికి వెళతారా? అంతఃపురానికి వెళతారా?" అని వాణ్ణి నౌకర్లు అడిగారు.

"నా గదికే పోతాను," అన్నాడు పేదవాడు.

మరి కొంచెంసేపటికి నౌకర్లు వచ్చి, "భోజనం తమ గదిలో చేస్తామంటారా, లేక అంతఃపురంలో చేస్తారా?" అని అడిగారు.

"ఇక్కడికే తీసుకురండి," అన్నాడు పేదవాడు.



భోజనం అయిన కొంతసేపటికి ఒక నౌకరు వచ్చి, "వేళ మించిపోయింది. తమరు అంతఃపురానికి వెళతారా?" అని అడిగాడు.

"ఇప్పుడే వెళుతున్నాను," అన్నాడు పేదవాడు.

నౌకరు సలాం చేసి వెళ్ళిపోయాడు.

అయితే పేదవాడికి ఎటు పోవాలో తెలీక కంగారు పుట్టుకొచ్చింది. వాడు అనేక ద్వారాలు తెరిచి చూసిన మీదట, అంతఃపురంలో ఆడవాళ్ళుండే గది తలుపు దొరికింది.

ఆ ఇంటి యజమానురాలు చాలా చక్కనిది. వాడు రావటం చూడగానే ఆమె లేచి ఎదురువచ్చింది. ఆమెను చూడగానే పేదవాడు కొయ్యబారిపోయి కాలు కదిలించలేక పోయాడు. ఆమె వాణ్ణి తిన్నగా తీసుకుపోయి, తన సరసనే కూర్చోబెట్టుకుని సంభాషణ మొదలు పెట్టింది.

వాడికి భయంతో గుండె గుబగుబలాడుతున్నది.

"చూడండి! మొన్న ఒక స్నేహితురాలు మన ఇంటికి వచ్చినప్పుడు ఉన్నట్టుండి మీ పేరు అడిగింది. మీరు నేననేది నమ్ముతారో, నమ్మరో! నాకు చచ్చినా మీ పేరు జ్ఞాపకం రాలేదు. ఎంత ప్రయత్నించినా ఇప్పటికీ నాకు మీ పేరు గుర్తు రావటం లేదు. మరేమీ అనుకోక, కాస్త చెబుదురూ!" అన్నదామె.



పేదవాడికి చాలా పెద్ద చిక్కే వచ్చింది. "ఇంతకాలం మనం కాపరం చేశాం గదా, నా పేరు ఎలా మరిచిపోయావు?" అన్నాడు వాడు.

వాడు తన పేరు చెప్పితీరాలని ఆమె పట్టుపట్టింది. వాడు తోచిన పేర్లన్నీ చెప్పాడు. వాడు అబద్ధమాడుతున్నట్టు బయటపడింది. ఆ స్థితిలో వాడు తాను చేసిన పాడుపని విధిగా బయటపెట్టవలసి వచ్చింది.

"నన్ను క్షమించండి!" అని వాడు ఆమెను ప్రాధేయపడ్డాడు.

"సరే, నిన్ను క్షమిస్తాను. కాని నా భర్త రాజుగారి ప్రధాన కథకుడు; అతని కోసం ఏ క్షణాన అయినా కబురు రావచ్చు. అప్పుడు ఏం చేస్తావు?" అన్నదామె.

ఆమె మాట పూర్తికాకమునుపే, రాజుగారి నుంచి పిలుపు వచ్చింది.

పేదవాడు వణికిపోతూ ఆమె కేసి తిరిగి, "ఇప్పుడు నేనేం చెయ్యాలి?" అని అడిగాడు.

ఆమె ఇలా చెప్పింది: "రాజుగారి ముందు రెండు ఆసనాలు ఉంటాయి. ఒకదాని మీద ముత్యాల దండ ఉంటుంది. రెండోదాని మీద బంగారు దండ ఉంటుంది. నువు ముత్యాలదండ మెడలో వేసుకుని, బంగారు దండ చేత పుచ్చుకుని, రాజుగారిని 'మిత్రమా!' అని సంబోధించి కథ చెప్పాలి."

రాజు పంపిన మనుషుల వెంట వాహనంలో పేదవాడు రాజభవనానికి వెళ్ళాడు. రాజభవనం చూస్తూంటేనే వాడికి ముచ్చెమటలు పోశాయి. రాజుగారి సమక్షంలోకి వెళ్ళాక, చేసేదిలేదు గనక, ముత్యాల దండ మెడలో వేసుకుని, బంగారు దండ చేత పట్టుకుని వాడు, "మిత్రమా!" అన్నాడు.

ఇంతలో వాడికి మెలకువ వచ్చి, జరిగినదంతా కల అని తెలుసుకున్నాడు. వాడు కాఫీదుకాణం మూలనే ఉన్నాడు. తన చింకిబట్టలు చూసుకుని వాడు పొందిన ఆనందం ఇంతా అంతా కాదు!



# సగం ధర

కూనయ్యకు పదెకరాల పొలమూ, ఊళ్ళో చిన్న చిల్లరకొట్టూ వున్నాయి. అయినా, అతడు పరమ పిసినారిగా పేరుపడ్డాడు. పంట నూర్పిళ్ళ సమయంలో ఒకనాడు కూనయ్య, భార్యను కొట్లో కూర్చోబెట్టి, తను కళ్ళానికి వెళ్ళాడు.

కళ్ళంలో ధాన్యం రాసిగా పోసివున్నది. నూర్పిళ్ళు పూర్తయ్యాక ఎంతో కొంత పేదలకు దానం చేయడం రైతులకు అలవాటు. కూనయ్య పిసినారిగుణం తెలిసినవాళ్ళు కావడంతో, ఒక్కరు కూడా అతని కళ్ళంకేసి రాలేదు. చుట్టుపక్కల కళ్ళాల్లో రైతులు, పేదలకు ధాన్యం ఇస్తూ కూనయ్యకేసి చూడసాగారు. కూనయ్యకు తల తీసేసినట్టయింది. తను కూడా ధాన్యం దానం చేసినట్టు అనిపించుకోవాలని, అతడు ఒకవంతు మంచి ధాన్యంతో మూడువంతులు తాలు ధాన్యం కలిపి, దూరంగావున్న కొందరు పిల్లలను దగ్గరికి పిలిచి, వాటిని వాళ్ళకు దానం చేశాడు!

పిసినారి దానగుణాన్ని, దూరంనుంచి చూసిన ఒక పెద్దమనిషి ఆశ్చర్యపడి, పిల్లలను దగ్గరికి రమ్మని, కూనయ్య దానం చేసినది తాలుధాన్యం అని గ్రహించి, ఏం చేయాలో వాళ్ళకు చెప్పి పంపాడు.

కూనయ్య ధాన్యం బస్తాలకెత్తించి, ఇల్లు చేరేసరికి, భార్య, కొట్లోవున్న ధాన్యం కుప్పను భర్తకు చూపుతూ, "ఎవరో ధర్మాత్ముడు ధాన్యం దానం చేశాడని చెప్పుకుంటూ కొందరు పిల్లలు వీధిలో వెళుతూవుంటే, పిలిచి, ఆ ధాన్యాన్ని సగం ధరకే కొనేశాను!" అన్నది సంతోషంగా.

ఆ ధాన్యాన్ని చూసేసరికి కూనయ్యకు గుండె ఆగినంత పనయింది. ఎందుకూ పనికిరాని తమ సొంత తాలు ధాన్యాన్ని, సగం ధరకు కొన్న భార్య తెలివితక్కువతనానికి, కూనయ్య ఎంతగానో బాధపడ్డాడు.

—దాసరి వెంకటరమణ






రామాపురంలో, రంగరాజనే ఒక రైతు వుండేవాడు. అయన ఎంతో వివేకవంతుడే కాక, గొప్ప వ్యవహారజ్ఞానం కలవాడు. గ్రామంలోనే కాక, దాపులవున్న గ్రామాల నుంచి ఎవరు ఎలాంటి మొండి సమస్యతో వచ్చినా, ఆయన దానికి యిట్టేపరిష్కార మార్గం చెప్పేవాడు.

ఒకసారి అదే గ్రామంలో వున్న, గంగన్న అనే పేదరైతు రంగరాజు దగ్గిరకు వచ్చి, ''బాబూ, మా ఇల్లు, యీ మధ్య మనుషులు మెసలడానికి వీల్లేనంత యిరుకుగా తయారైంది. నాకు ఇప్పుడు దానికన్న పెద్ద ఇల్లు కట్టుకునే స్థోమత లేదు. ఇల్లు యిరుకు తగ్గి, కాస్త విశాలంగా వుండే మార్గం ఏదైనా చూపండి,'' అని కోరాడు.

రంగరాజు కొద్దిసేపు ఆలోచించి, ''గంగన్నా, నువ్వు ఇంటి దగ్గర మేకల్ని, కోళ్ళనూ కూడా పెంచుతుంటావు గదా!'' అన్నాడు.

గంగన్న తను పెంచేవాటి వివరాలు రంగరాజుకు చెప్పాడు.

''సరే, గంగన్నా. ఈ రోజు నుంచి ఒక మేకను, దాని సంతానంతోపాటు, మీ ఇంట్లో కట్టివేసి, నాలుగు రోజుల తర్వాత వచ్చి, అప్పుడు మీ కుటుంబానికి యిల్లెలా వున్నదో చెప్పివెళ్ళు,'' అన్నాడు రంగరాజు.

ఇది విన్న గంగన్న, తన సమస్యకు పరిష్కారం దొరికిందన్న సంతోషంతో గబగబా ఇంటికి వెళ్ళి, రంగరాజు చెప్పినట్టు, ఒక మేకనూ, దాని పిల్లలనూ ఇంట్లో కట్టివేశాడు. ఇందువల్ల, ఇల్లు మరింత యిరుకైపోయింది. నాలుగు రోజులు, నాలుగు యుగాలుగా గడిచినట్టు, గంగన్న ఇంట్లోవాళ్ళు ఎంతగానో బాధపడ్డారు.

గుడిమెళ్ళ రాజగోపాల్

గడువు ముగియగానే, గంపెడు దిగులుతో తన దగ్గిరకు వచ్చిన గంగన్నను చూసి, రంగరాజు, ''గంగన్నా, ఏందిగులు పెట్టుకోకు. కొత్తగదా, అలాగే వుంటుంది. ఈ రోజు నుంచీ, మరొకజత మేకలను ఇంట్లో కట్టివెయ్యి. మళ్ళీ రెండు రోజుల తర్వాత నాకు కనిపించు,'' అని చెప్పి పంపేశాడు.

రెండు రోజుల తర్వాత గంగన్న, రంగరాజు దగ్గిరకు వచ్చి, రెండు చేతులూ ఎత్తి నమస్కరిస్తూ, ''బాబూ, యిప్పుడు ఇంట్లో కాలు కదపడానిక్కూడా చోటు లేక ఉక్కిరిబిక్కిరైపోతున్నాం. తమరే ఏదైనా మార్గం చెప్పాలి,'' అన్నాడు కీచుమనే కంఠస్వరంతో.

''అలాగా!'' అంటూ రంగరాజు చిన్నగా నవ్వి, ''గంగన్నా, అయితే ఒక పని చెయ్యి. ఇంట్లో కట్టివేసిన మేకల్లో, ఒక జతను బయటికి తరిమెయ్యి. రెండు రోజు లాగి, ఇల్లెలా వుందో వచ్చి చెప్పు,'' అన్నాడు.

రెండు రోజుల తర్వాత, తన దగ్గిరకు వచ్చిన గంగన్న ముఖంలో, కొద్దిపాటి సంతోషం కనిపించడం చూసి, రంగరాజు తృప్తిపడి, ''ఇప్పుడు, నీ ఇల్లు యిరుకు తగ్గి, కాస్త విశాలంగా వున్నట్టున్నదే, అవునా?'' అని ప్రశ్నించాడు.

అందుకు గంగన్న, ''అవును, బాబూ! లోగడకన్న ఇప్పుడు కొంచెం ఊపిరి పీల్చుకోగలుగుతున్నాం,'' అన్నాడు.



"అలా అయితే, ఒక పని చెయ్యి. ఆ మిగిలిన మేకలను కూడా బయట కట్టేసి, తరవాత కనిపించు," అని చెప్పాడు రంగరాజు.

నాలుగు రోజు లాగి, తనవద్దకు వచ్చిన గంగన్న ముఖం చెప్పలేనంత సంతోషంతో కళకళ లాడుతూండడం, రంగరాజు గమనించాడు.

"ఇప్పుడు, నీ ఇంటి యిరుకు ఎలా వున్నది ?" అని అడిగా డాయన చిన్నగా నవ్వుతూ.

"బాబూ, మీరు నాకింతంతనరాని గొప్ప మేలు చేశారు. మీ దయవల్ల, ఇప్పుడు మా ఇల్లు పూర్వంలా యిరుకుగా లేక, బాగా విశాలంగా తయారైంది. మా కుటుంబంలో ఎవరికీ, ఇల్లు యిరుకని పించడం లేదు. అంతా మీ చలవ !" అని, గంగన్న రంగరాజుకు నమస్కరించి వెళ్ళిపోయాడు.

ఆ మధ్యనే రంగరాజు ఇంట పనికి కుదిరిన, వెంకప్ప అనేవాడు మొదటి నుంచీ గంగన్నా, రంగరాజుల సంభాషణా, తన యజమాని యిచ్చే సలహాలూ వింటూనే వున్నాడు.

వాడికి యీ జరిగినదంతా అయోమయంగాతోచి, రంగరాజును, "అయ్యా, ఈ గంగన్నవట్టి వెర్రివాడిలా వున్నాడు. ఆయన మీ దగ్గిర సలహాకు వచ్చినప్పుడు ఎలా వున్నదో, ఇప్పుడూ ఆ ఇల్లు అలాగే వున్నది గదా ? మరి ఇరుకు తగ్గడ మేమిటి !" అని అడిగాడు.

అందుకు రంగరాజు, "గంగన్న వెర్రి వాడేం కాదు; అయితే అంతగా లోకజ్ఞానం లేని మనిషి. అతడి మాటల్లోనే, కొత్తగా పెద్ద ఇల్లు కట్టుకునే స్థోమతు అతడికి లేదు. అయినా, ఉన్న ఇంటితో తృప్తి పడలేక అతడు ఎంతగానో బాధపడి పోతున్నాడు. అందుకే, ఇంట మేకల్ని కట్టివెయ్యమని నేను సలహా యిచ్చాను. దానితో అతడికి, ఒక ఇల్లు యిరుకూ— విశాలం కావడంలో వున్న తేడా గ్రహింపుకు వచ్చింది." అని చెప్పాడు.



## జెర్రి కాళ్ళు

జెర్రిని ఆంగ్లంలో సెంటిపెడ్ అంటారు. సెంటిపెడ్ అంటే వందకాళ్ళు అని అర్థం. అయితే కొన్ని రకాల జెర్రులకు మాత్రమే యాభై జతల కాళ్ళుంటాయి. ఐరోపాలో కనుగొనబడిన హిమాన్‌టరమ్ గేబ్రిలిస్ అనే జెర్రులకు 171 మొదలు 177 జతల కాళ్ళున్నాయి.



## బ్రహ్మాండమైన మంచుదిబ్బ



ప్రపంచంలోనే అతి పెద్దదయిన మంచుదిబ్బ దక్షిణ పసిఫిక్ సముద్రంలో 1956వ సంవత్సరంలో కనుగొనబడింది. దీని వైశాల్యం 12,000 చదరపుమైళ్ళు. 1958 వ సంవత్సరంలో గ్రీన్‌లాండ్ అవతల చాలాఎత్తయిన మంచుదిబ్బ కనుగొనబడింది. దీని ఎత్తు 550 అడుగులు।

## హమ్మింగ్ బర్డ్

దక్షిణ అమెరికాలోని తేనెపిట్టలాంటి ముచ్చటైన హమ్మింగ్ బర్డ్, సెకండుకు 80 సార్లు రెక్కలు కొట్టుకుంటుంది. అంటే అన్ని పక్షులకన్నా ఈ పక్షి ఎక్కువ బలాన్ని ఉపయోగించగలదు. ఈ పిట్ట పైకి నిటారుగానూ, కిందికీ, పక్కలకూ మాత్రమే కాకుండా వెనక వైపుకు కూడా ఎగరగలదు.



# చందమామ

## విజ్ఞాన వినోదాలు విరజిమ్మే మాసపత్రిక

* చందమామ మన పురాణ, సాహిత్య రత్నాలను క్రమపద్ధతిలో అందిస్తుంది.
* సువిశాల దృక్పథంతో, ప్రపంచ సాహిత్యంలోని అద్భుత కావ్యగాథలను సులభమైన భాషలో తెలియజేస్తుంది.
* సున్నితహాస్యం, విజ్ఞాన వినోదాత్మకమైన చక్కని కథలతో పాఠకులను ఆకట్టుకుంటుంది.
* మన పురాణగాథలను సాధికారంగా అందజేస్తుంది.
* వినోదాత్మకమైన కబుర్లతో, లోకజ్ఞానం కలిగించే శీర్షికలతో చదువరులను అలరిస్తుంది, చందమామ.
* చందమామ మీ జీవితాలలోనే కాదు, మీ బంధుమిత్రుల జీవితాలలోనూ నిర్మాణాత్మకమైన పాత్ర వహించగలదు. మీ ప్రియమిత్రులకు చందమామను బహూకరించండి.

బాలల కోసం ఉద్దేశింపబడిన చందమామ, పాఠకులు యువహృదయాలతో వెలుగొందడానికి దోహదం చేస్తుంది.

ఈ పదమూడు భాషలలో ఏ భాషలోనైనా చందమామ చందాదారులుగా చేరండి :

తెలుగు, తమిళం, హిందీ, ఇంగ్లీషు, అస్సామీ, బెంగాలీ, గుజరాతీ, కన్నడం, మలయాళం, మరాఠీ, ఒరియా, పంజాబీ, సంస్కృతం.

**సంవత్సర చందా : రూ. 30-00.**

ఏ భాష చందమామ కావాలో తెలియజేస్తూ మీరు చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్
చందమామ బిల్డింగ్స్
వడపళని, మద్రాసు-600 026.

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1988 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.



S. B. Takalkar



S. G. Shenoy

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగాని కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ నవంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: పైదాకా పోతే దక్కుతుంది ఫలం! రెండవ ఫోటో: ఎందాకా పోతే చిక్కుతుంది జలం?

పంపినవారు : కుమారి కె. సుధాప్రియ, న్యూకాలనీ, శ్రీకాకుళం—532 001

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---

# విజయచిత్ర

డాల్టన్ ప్రచురణ







ఇరవై సంవత్సరాలుగా సినిమా అభిమానులలో
ఉత్తమాభిరుచులను పెంపొందింపజేస్తున్న
మేటి సినిమా పత్రిక

# విజయచిత్ర

విడిప్రతి: రూ. 4/=

సాలుచందా: రూ 48/=

చందాలు బ్యాంక్ డ్రాఫ్ట్‌ద్వారా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజెన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు—600 026